

ఓమ్.

శ్రీరస్తు.

# నివేదనము.

నే నింతకు మున్ను ప్రచురించిన 'సుభద్ర' యను నాచిన్న వచనగ్రంథమునకు నా యాంధ్రసోదర సోదరీమణు లనేకవిధములఁ బ్రోత్సాహము నొసఁగియున్నారు.

విద్యార్థు లగుచున్న బాలికాబాలకుల కోమలహృదయములు దేశీయములైన ప్రాచీనేతిహాసముల పవిత్రప్రభావములకుఁ గ్రమముగా నాబద్ధములగునట్లొనర్చి వారిజీవనప్రవాహము శాశ్వతమైన శ్రేయోమార్గమునకుఁ బ్రవర్తిల్లఁజేయుటయే వారియభివృద్ధి గోరువారి ముఖ్యోద్దేశమై యున్నది.

మనవిద్యార్థులు, సుశిక్షితులై వెలయ, భారతదేశమునందలి పురాణేతిహాసములె వారి శారీరక మానసి కాధ్యాత్మిక సంబంధములైన సమున్నతభావరత్నములకు అక్షయ భండారములై యొప్పుచున్నవి. నీతి మత ధర్మముల కాదర్శస్వరూపము లైన చరిత్రములు—రాముఁడు, హరిశ్చంద్రుఁడు, సీత, చంద్రమతి మొదలగువారి చరిత్రములు,

మనస్త్రీపురుషుల చిత్తములకును ప్రకృతులకును సంపూర్ణాను కూలములును సంపూర్ణోపయోగకరములును గాఁగలవు. కాన యిప్పటి మనవిద్యార్థి విద్యార్థినీజనుల హృదయముల నాకర్షించుటను నట్టిచరిత్రము లత్యుజ్జ్వలములైన దృష్టాంతములతోఁ బ్రచురింపఁబడవలసియున్నవి. అట్టిగ్రంథములు మనవారి కెంతటిసుఖసేవ్యములో యంతటిశ్రేయోదాయకములును గాఁగలవు.

ఈ జడభరతుని చరితము మనభాగవతముననున్నదాని కంటె వంగభాషయందు శిష్టోగ్ధులకు హృదయాకర్షకమగు చక్కని కథాసరణిని శ్రీ 'దీనేశచంద్రసేన' మహాశయునిచే రచింపఁబడి యున్నది. ఆగ్రంథము ననుసరించియే నేను మనవారి యుపయోగార్థము దీనిని వ్రాసియున్నాను. మనవిద్యార్థి విద్యార్థినీజనులయు సోదరసోదరీమణులయు నంతరంగముల యందు నీగ్రంథోద్దేశమున కేమాత్రముచోటు దొరకినను నేను కృతార్థురాల నగుదును. ఏమహామహుని యుత్కృష్ట ప్రభావముచే మనమాతృదేశమునకు 'భరతవర్ష' మను సుప్రసిద్ధనామము గలిగినదో యట్టి భరతునిచరిత్రమగు నీగ్రంథమును దేశీయులు తప్పక యాదరింపఁగలరనినమ్ముచున్నాను.

కాకినాడ.
9-8-25.

పులుగుర్త లక్ష్మీనరసమాంబ.

శ్రీరస్తు.

—*కృతి*—

మనసాంఘికమర్యాద ననుసరించి మనసంతానమునకు మనపెద్దలనామధేయము లుంచి యందువలనఁ బితౄణమును గొంత దీర్చికొనినట్లు సంతుష్టుల మగుచున్నాము.

తొలుతఁ బరమేశ్వరుఁడు మాకుఁ బ్రసాదించినమాప్రియతనూజునకు, భక్తి పెంపునను పెద్దల యాదేశమునను భగవన్నామముతో నామకరణ మొనర్చి యానందించుచున్నాము.

పిదప, జనకరూపమున నవతరించిన యీ నా ద్వితీయపుత్త్రిని—జడభరతుని—నానైహికదైవమునకు జనకులును, నాకుఁబితృసములును, భక్తాగ్రేసరులును, కీర్తిమూర్తులు నగునావామగారు పులుగుర్త కామరాజుగారిపేర సహితభక్తి విశ్వాసంబుల వెలయించి కృతార్థురాల నగుచున్నాను.

పులుగుర్త లక్ష్మీనరసమాంబ.

శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారిచే
రచియింపఁబడిన గ్రంథములు.

1 మంగళహారతుల శతకము (స్వరములతో) 0—8—0
డిటో. (స్వరములులేనిది) 0—4—0
2 నీతిపదములు ... ... 0—4—0
3 సత్కథావల్లరి ... ... 0—10—0
4 సుభద్ర ... ... ... 0—14—0
5 జడభరతుఁడు ... ... 0—12—0

# పూర్వకవిప్రణీతము.

ఏకాదశీమహిమానసర్వస్వము.

రెండాశ్వాసముల పద్యకావ్యము 0—10—0

దొరకుచోటు:—

పులుగుర్త బృందావనశర్మ,
(శ్రీసావిత్రీ)కార్యస్థానము,
జగన్నాథపురము. (కాకినాడ.)

అచ్చువ్రాయుపనియు.

డయ్యెను. అప్పు డావరణమునందు ఖడ్గహస్తులై యున్నగస్తి వలె నన్నకత్తిక నుస్త్రరించుట కాసన్నద్ధులయ్యెను.

కుపితసింహులై యున్న యన్నదమ్ముల[illegible]ను నిలిచి రాజు వారిపోరాటమును నివారించెను.

పంచజని యంతఃపురమునం దొకమంచముపై నుండి తలక్రింది పట్టుమెత్త తడిసిపోవునట్లు దుఃఖాశ్రుప్రవాహ[illegible] నెలుంగెత్తి "కోడలుగాదిది క్రూరరాక్షసి! నా పెం[illegible] వేళనో యిది పుట్టంబెట్టుకొనును? అని [illegible] పరణముకు నాకమువురం బుట్టి పోయి[illegible] పలవించుచుండెను.

రా జప్పుడే గదిలోనికిఁ బ్రవేశించుచు "దేవి! ఆపకు పాతకము నీవు విడువవలయు"—అనుచుండఁగా నహాటునఁ బంచజని పాన్పుడిగి దుర్భరహృదయావేగము నాఁపుకొనలేక "మహారాజా! ఇదిన్యాయము, ఇదిఅన్యాయము ననువిచారము లేకుండ నింతకాలము మీరీరాజ్యము నెట్లు పరిపాలించు చున్నారో వింతగా నున్నది? అన్నదమ్ము లిద్దఱిలో దోషి యెవ్వఁడో వానిని శిక్షింపకుండ వానికి సఖ్యభావ మొనఁగూర్చు టకు వృథా ప్రయాసపడుచున్నారు" అని తీవ్రముగాఁ బలికెను.

రాజు మాఱాడలేదు. పంచజని యచ్చటినుండి వెడలి పోయెను. ఒకటిరెండుసారు లటునిటు నడయాడి రా జక్కట

నున్న తన్నికంబళముపై వీరాసనుఁడై గూరుచుండెను—తీవ్రవైరాగ్యనిమగ్నుఁడై యుండెను—వదన మించుక పైకెత్తఁబడియెను—నేత్రాంతకిరణము లుత్తేజితములగుచుండెను. అంతరంగి విరక్తి యాతని ముఖమండలముపైఁ దాండవింప సాగెను. ఆతఁ డిట్లనుకొనియెను. "ఈసంసారమునం దేమి యున్నది? ఇన్నిదినములనుండి నాసర్వప్రయత్నములన్నియు విఫలము లైనవి. అహా! తెలిసిపోయినది? ఎట్టి సూక్ష్మబుద్ధియైనను, ఎట్టి వేదవేదాంతశాస్త్రజ్ఞానమైనను నడవడిని బరిశుద్ధపఱుపఁ జాలదు. 'కర్మణా బాధ్యతే బుద్ధి, ర్నబుద్ధ్యా కర్మ బాధ్యతే' అట్లు కానిచో బుద్ధిమంతులైన యీ పుత్త్రిలిద్దఱు నిట్టివిపద్దశ నేల యభినయింతురు? ఎవ్వఁడు నిరీహాపురుషుఁడై సంచరింపఁ గల్గుచున్నాఁడో వానికే యీప్రపంచమంతయు నిష్టానువర్తి కాఁగలదు. వాఁడే మేలొందఁగలవాఁడు. వాఁడే సుఖియగు చున్నాఁడు." మఱికొంతసేపిట్లు యోజించుకొని యాతఁడుదాసీనునివలె నటనుండి వెడలిపోయెను.





శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# జడభరతుఁడు.

## మొదటి ప్రకరణము.

రాజర్షియైన భరతుఁడు పండువెన్నెల బయలఁ బాల సంద్రమువంటి పాన్పుపై నర్ధశాయియై యఱచేత శిరము మోపి యాలోచనానిమగ్నుఁడై యుండెను. ఆతని ముఖ మండలము విచారరేఖాంకితమై యుండెను. పట్టపుదేవియైన "పంచజని" పాదములకడఁ గూర్చుండి "అయ్యో! ఎట్టి యభాగ్యుఁడు నాకడుపునఁ బుట్టినాఁడు? ఈమహారాజు చిత్త మెంత చింతాక్రాంతమై యున్నది? రాజ్యములున్న నేమి? పూజ్యత లున్ననేమి? ఏమున్ననేమి? చిత్తమున శాంతి లేనప్పుడు?" అనుకొనుచుండెను.

రాజు— దేవి! నిరంతరభగవద్ధ్యానపరుఁడై కేవ లానందానుభవుఁడై సమాధిస్థుఁడై [illegible] కుమారుఁడు [illegible]

గలఁడు ? ఇఁక సుదర్శనుఁడన్ననో, వాఁడు కేవల మొక పిచ్చి వాఁడు. వానియామోద మేమో వానిది. వానిప్రపంచ మేమొ వానిది. ఈసంసార మనసేమో వానికిఁ దెలియనే తెలియదు. దానికిఁ దోడు తనయన్నయుఁ దనతమ్ముఁడుఁ బోరాటము సకు దిగినప్పు డొక్కనిముష మైనను వాఁడిఁక నింట నిలువఁడు. వెంటనే మందానదియొడ్డునకుఁ బోయి భైరవి రాగముఁ బాడు కొనుచుఁ గూరుచుండును. ఈరీతిగా నున్న దీ సంతానభాగ్యము! ఏబిడ్డ నెట్లు మందలించుకొనవలెనో మీరు విచారించుకొన వలెను.

రాజు—దేవీ! న న్నేమనెదవు? గృహమునందెట్టిన శాంతినెలకొల్పుటకు నానాప్రకారములఁ బ్రయత్నించుచుంటిని. అనేకోపాయము లన్వేషించుచుంటిని. అనవరతము నా పరిచర్య యందుండునట్లు నియోగించి యానని సర్వదా రుడఁబాయక చనవున ననేకసదుపదేశము లొనరించు చుంటిని. ఉదాహరణ స్వరూపులుఁ బూజ్యపాదులునగు మహాపురుషులచరిత్రములఁ వినుపించుచు గురుజనులయెడల భక్తి నెలకొనఁజేయుచుంటిని. కుమతులైన యతివల దుర్బోధనల నాలించినవార లనేకసమ యములం దిహపరములకు దూరులైపోయినసంగతులు తెలుపు చుంటిని. సూక్ష్మబుద్ధియైన యానందుడు నాప్రసంగములు తాత్పర్య [illegible] నవిస్మరణముగా గ్రహించుచుండెను. ఇఁక హీనచరిత్రయు పరిపూర్ణ మయ్యెననియే నే భావించుచుంటిని. కాని

నీవు మునుపటివలెనే నేఁడుగూడ నన్నుఁజూచినంతనె యసహ్యా
మైన విరక్తితో భూమియుగము మరిచివైచినాఁడు—వెంటనే
వాఁడొక్కఁడు కదిలించి యుత్తేజకస్వరముతో "నాయనగారూ!
అమ్మతోడను, అన్నతోడను నే నీయింట నిఁకవసింపఁజాలను.
ఏమైన నొసఁగి నన్నును నాభార్యను వేఱొకచో జీవింపనిండు"
అని చెప్పినాఁడు. ఉదయాస్తమయములు నా కీగృహవిచారము
దక్క మరొక్కటి తోఁచుటలేదు. ఆహారమునందభిరుచిలేదు.
నిద్రయం దాసక్తిలేదు. నాభక్తి, నాధ్యానము, నానిర్మల
జ్ఞానము నాకు స్వప్నపదార్థము లైపోవుచున్నవి. నాచిత్తమునకు
శాంతిలేదు.

ఈవిధముగా వీరు రాత్రి గడపిరి. తెల్లవాఱినది. ఉదయముననే రాజు, పెద్దకుమారుఁడగు—రాష్ట్రభృత్తునకుఁ గబురంపెను. రాష్ట్రభృత్తు వినయవినమితుఁడై యరుదెంచి సభక్తికముగాఁ దండ్రికి దండప్రణామములాచరించినిల్చెను.

రాజు—నాయనా! రమ్ము. ఇటుగూరుచుండుము! శ్రీకృష్ణునియవతారమూర్తి యని పేరొందిన ఋషభర్షి వంశమునందు మన ముద్భవించితిమి. అట్టి మనమే మన ధర్మము [illegible] నింపకున్న నిఁకెవ్వరు ధర్మమాచరింపఁగలరు! చూడు! నేఁడు మన యతిథిశాలనుండి యొకసంవాదము వచ్చినది—అచ్చటి యధికారవర్గమువారి గుణలోపముచే నతిథిపూజలు సంకుచితములగుచున్నవఁట. బ్రహ్మమంతయు నపగు

మొదటిప్రకరణము.

నీవు నేటినుండి యతిథిశాలాధికారము సర్వము నిర్వహింప వలెను. మన యతిథిశాలలో నతిథులు సర్వసంతుష్టులు గావలయును. అతిథినారాయణస్వరూపుఁడని పెద్దలు వక్కాణించి యున్నారు. అతిథుల సంతుష్టులఁ గావించి తన్మూలమున నారాయణప్రీతిని బడయుము. నీకు సకలముశుభమగును. పోయి రమ్ము.

రాష్ట్రభృత్తు తండ్రియాజ్ఞను భక్తిపూర్వకముగా శిర సావహించి సెలవు గైకొని యటనుండి వెడలి పోయెను. కుమారుఁడు ఉదయాస్తమయములందు యథానియమముగా నతిథిపరిచర్యలలో నియుక్తుఁడైనచో, నాతనిహృదయమునం దుదారభావములును, మానవసేవావృత్తియు జాగరూకములై యుండు నని రాజు భావించెను.

రాజకుమారుఁడు తండ్రియనుజ్ఞ తలఁదాల్చి యతిథిశాల యందుఁ బ్రవేశించెను. అతఁ డతిథిశాలయం దడుగుపెట్టిన తోడనే యాతని యానంద ముప్పొంగఁజొచ్చెను. అతని సేవాసిరతినిఁగని లోకులు సహస్రముఖముల నాతనిఁ బ్రశంసింపఁ జొచ్చిరి అనేకసమయములయం దాతఁడు సామాన్యభృత్యులు చేయవలసినపనులుగూడ స్వయముగా నొనరించుచుఁ దన యతిథిసేవాసక్తిని వెల్లడించుచుండెను. అతిథిశాల అతిథి గణముచే సంవర్ధమాన మగుచుండెను. రాజస్థానియం దెల్లెడల నాతనికీర్తి ప్రచారిత మగుచుండెను. అతని కీర్తియు దిగ్ది

మానము లేదు. పరమోత్సాహముతో నాతఁడు సర్వదా
కర్తవ్యసంపాదనమునందు నియుక్తుఁడై యుండెను. అయినను
అతిథిశాల విడిచి యింట నడుగుపెట్టినప్పటికి తమ్ముఁడైన
నావరణుని విషయమునందు మాత్రము నాతని యున్నతభావము
లెక్కడకో యెగిరిపోవుచుండును.

రాజకుమారుఁ డిప్పుడే యతిథిశాలనుండి గృహమున
కేతెంచెను. ఇంటిలోపలనుండి యెలుఁగెత్తి యెవ్వరో కయ్యము
చేయుచున్న ట్లనుమానించిరి. రాష్ట్రభృత్తానంకకు దృష్టి
సారించి యాలించి వినుచుండెను.

గృహములోపల నావరణునిభార్య శాంతశీల, తన పరి
జనులదగ్గఱఁ దనబావగారిపై నిందలను శ్లేషోక్తులతోఁ గురి
పించుచుండెను. అనర్థసంబంధములైన యీ పలుకులే రాజ
కుమారున కిప్పుడు గృహమునందడుగిడఁగానే చెవులు గింగురు
మనిపించినవి. రాష్ట్రభృత్తామహావాక్యముల యర్థము నా
వారలముగా నాకళించుచున్నకొలఁదిని, క్రమముగా నాతని
యందఁ గ్రోధశత్రుస్ఫురణము గాఁజొచ్చెను. చూచుచుండఁ
గనే యాతని నేత్రము లగ్నిఁ గురియించుచుండెను. అతఁడిఁక
నైజప్రకృతి ననుసరింపకుండ లేకపోయెను.

రాజకుమారుఁడు ధనుర్ధారియై పరునిడుచుఁ దలముడి
వీడి యూడఁ, బైచీర జీరాడ లోనఁ బ్రవేశించి శాంతశీల
సామీప్యమునందున్న ఆవరణుని సంహరించుట కుద్యుక్తుఁ

డయ్యెను. అప్పు డావరణుఁడును ఖడ్గహస్తుఁడై యున్నట్టి వలె నన్నకుత్తుక నుత్తరించుటకు సన్నద్ధుఁడయ్యెను.

కుపితసింహులై యున్న యన్నదమ్ములిద్దఱ... ను నిలిచి రాజు వారిపోరాటమును నివారించెను.

పంచజని యంతఃపురమున శోకమంచముపైఁ బడియుండి తలక్రింది పట్టుమెత్త తడిసిపోవునట్లు దుఃఖాశ్రుప్రవాహములను నెలుఁగెత్తి "కోడలుగాదిది క్రూరరాక్షసి! నా పెద్ద... ని వేళనో యిది పొట్టఁబెట్టుకొనును? అని ... పరుఁడు నాకడుపునఁ బుట్టిపోయినాఁ... పలవించుచుండెను.

రాజప్పుడే గదిలోనికిఁ బ్రవేశించుచు "దేవి! ఆపక్షపాతము నీవు విడువవలయు"—అనుచుండఁగా నచటునఁ బంచజని పాన్పుదిగి దుఃఖరహృదయావేగము నాఁపుకొనలేక "మహారాజా! ఇదిన్యాయము, ఇదిఅన్యాయము ననువిచారము లేకుండ నింతకాలము మీరీరాజ్యము నెట్లు పరిపాలించు చున్నారో వింతగా నున్నది? అన్నదమ్ములిద్దఱిలో దోషి యెవ్వఁడో వానిని శిక్షింపకుండ వారికి సఖ్యభావముఁ గూర్చుటకు వృథా ప్రయాసపడుచున్నారు" అని తీవ్రముగాఁ బలికెను.

రాజు మాటాడలేదు. పంచజని యచ్చటినుండి వెడలి పోయెను. ఒకటిరెండుసారు లటునిటు నడయాడి రాజక్కడ

నున్న కృష్ణకంబళముపై వీరాసనుఁడై కూర్చుండెను— తీవ్రధ్యానమగ్నుఁడై యుండెను— వదన మింకను పై కెత్తఁబడియెను— కటాక్షకిరణము లుత్తేజితములగుచుండెను. అంతరంగిక విరక్తి యాతని ముఖమండలముపైఁ దాండవింప సాగెను. ఆతఁ డిట్లనుకొనియెను. "ఈసంసారమునం దేమి [illegible] ప్రయత్నములన్నియు విఫలము లైనవి. అహా! తెలిసిపోయినది? ఎట్టి సూక్ష్మబుద్ధియైనను, ఎట్టి వేదవేదాంతతత్త్వజ్ఞానమైనను నడవడిని బరిశుద్ధపఱుపఁ జాలదు. 'కర్మణా బాధ్యతే బుద్ధి, ర్నబుద్ధ్యా కర్మ బాధ్యతే' అట్లు కానిచో బుద్ధిమంతులైన యీపుత్త్రిలిద్దఱు నిట్టివిపద్దశ నేల యనుభవింతురు? ఎవ్వఁడు నిరీహాపురుషుఁడై సంచరింపఁ గల్గుచున్నాఁడో వానికే యీప్రపంచమంతయు నిష్ఠానువర్తి కాఁగలదు. వాఁడే మేలొందఁగలవాఁడు. వాఁడే సుఖి యగుచున్నాఁడు." మఱికొంతసేపిట్లు యోచించుకొని యాతఁడుదాసీనునివలె నటనుండి వెడలిపోయెను.



# జడభరతుఁడు.

## రెండవ ప్రకరణము.

అరుణోదయ మింకను గాలేదు. వనవృక్షములయందుఁ బక్షిగణము లొక్కటొక్కటి మేల్కొని యానిర్నిద్రారణ్యము నందు, ఆబ్రాహ్మీముహూర్తమునందుఁ బ్రకృతిదేవిగృహాంగణ ములలోఁ బ్రశాంతగాన మొనరించుచు లోకమును మేలుకొల్పు చుండెను. ప్రత్యూషవాతపోతము లప్పుడే లేచి జీవసేవ లొనరించుటకు దెసలకు బయలు దేఱినవి. ప్రాంతవాటికలనుండి వచ్చుచున్న యొకపుణ్యపురుషుఁ డాయాతిథ్య మందుకొని తాపత్రయదుఃఖోపశమనముఁ బొందుచుండెను. "ఆహా! కృత్రిమసౌందర్యమయమైన గృహమునకును స్వభావసుందర మైన వనమునకును ఎంతభేదమున్నది ?" అని యాతఁడు తల పోసికొనుచుండెను. అకారణబంధుఁడై మందమారుతుఁడు మైమఱచునట్లు సేవ లొనరించుచుండెను. ఆఓంకారపంజరశుకి ఆయుపనిషదుద్యానకేళీకలహంస, ఆయాగమవిపినమయూరి, ఆజగన్మయి యశమును గూర్చి గానమొనరించుచున్న విహంగ ముల కలరవములు నిర్నిద్రాకాశమునఁ బ్రో[illegible] హృదయము

రాగముల సుస్వాగతము జేయుచుండెను. దరవికసితములగుచున్న వనకుసుమములు బంధురదివ్యగంధము లుచ్ఛ్వాసవాయువులతో లోపలఁ బ్రవేశించి దుస్సంకల్పవాసనావిశిష్టమైన యంతరంగ మును బవిత్రామోదమయము గావించుచుండెను. సాధువు లైన కురంగడింభకములును, ఋషిప్రభావములచేఁ గ్రూర స్వభావములు మఱచి సాత్వికములై సంచరించుచున్న వన జంతువులును, ఖద్యోతరాగరంజితములై వివిధకాంతులచే విరాజిల్లుచున్న ప్రసూనవల్లికలు, నికుంజపుంజములు, ఫలవృక్ష ములు నన్నియును గన్నులఁ గృతార్థములఁ గావించుచుండెను. పవిత్రమధురవారిపూరితములైన జలాశయముల జలంబాచ మింప జిహ్వ పావన మగుచుండెను. "ఆహా! జ్ఞానేంద్రియానంద సంధాయకమగుచున్న యిచ్ఛావనప్రదేశమునకుఁ బురాకృత సుకృతమిత్రము నన్నిట్లు దెచ్చెనుగదా?" అనుకొనుచు నా యోజానుబాహుఁడు ముందునకు నడచుచుండెను.

వెనుకనుండి కొందఱుమనుష్యులు గుంపుగూడి వేగ ముగాఁ బరువెత్తుకొని వచ్చుచున్న ట్లడుగులచప్పుడు లాతనికి వినఁబడియెను. అతఁడు వెనుదిరిగి చూచునంతలో సాక్షాల్లక్ష్మి వలె నొక యంగనామణి ప్రత్యక్షమై యాతనిపాదములపై సాష్టాంగపడియెను. ఆమె వెనువెంటనే యామెపరివారు లైదుగురును వినమితాంగులై యాతనిచరణములఁ బట్టివేసిరి.

"ప్రాణేశ్వరా! మాయపరాధము లన్నియుఁ గరుణతో

నైరింపుఁడు! మీపాదాబ్జములకంటె మాకు శరణ్యములేదు”
అని యాచెలువ యెలుఁగెత్తి విలపింపఁజొచ్చెను.

బిడ్డలందఱును భయకంపితస్వరముతోఁ “తండ్రీ! సదయుఁడవై మమ్ము క్షమింపుము! ఇఁక నొక్క గృహకలహమైనను మనయింట జరుగనీయ మని శపథముచేయుచున్నాము. వనమునుండి గృహమునకు మఱలుము. మమ్ము రక్షింపుము.” అని యేకగ్రీవముగా నార్తనాదములు సేయఁజొచ్చిరి.

భరతమహారాజు ప్రశాంతుఁడై వారందఱి వారించి యొక్కెడ విశ్రమింపఁజేసి తానును గూర్చుండి వారితో నిట్లు పలికెను. “గృహసౌఖ్యమునందు నాకు విశ్వాసము నశించి పోయినది. మీ యెవ్వరిమాటలనుగాని నేనిఁక నమ్మఁజాలను. మీరిప్పుడు నిజముగా గృహమునందలి శాంతిసుఖమునే కోరుచున్నచో మీకవశ్యముగా నది లభింపఁగలదు. ఒండొరులన్యోన్యానురాగబద్ధులై బ్రతుకుదెఱవు గనుఁడు. మీకప్పుడు గృహము స్వర్గము కాఁగలదు. కాని నే నిఁక గృహమువంకకు మాత్రము మఱలువాఁడను గాను.”

పంచజని తనపతి నిస్పృహావాక్యములను విని మిక్కిలి యడలుచు నాతనిని గృహమునకుఁ దిరిగి రమ్మని దీనాతిదీనముగా ననేకవిధముల వేఁడుకొనియెను.

రాజు—“దేవీ! సంసారముతో నాకుఁగల సంబంధములన్నియు సహజక్రమముగా సడలిపోయినవి. వయసుమీరినది.

శాస్త్రానుసారముగా నాకిప్పుడు వానప్రస్థమే యవలంబనీయము. నీవు నీపుత్త్రులతో గృహమున కరిగి గృహమున శాంతి నెలకొనఁజేసి సుఖింపుము. పొమ్ము." అని పలికెను. పుత్త్రులును మఱిమఱి ననేకప్రకారములఁ దండ్రి నింటికి రమ్మని ప్రార్థించిరి.

రాజు—"పండి రాలిన ఫలము మఱలఁ జెట్టుకొమ్మ నంటుకొనదు. బిడ్డలారా! శమదమాదులఁ బొంది సుఖమొందుఁడు, పొండు" అని వారందఱను వీడ్కొని యథేష్టముగాఁ బోఁజొచ్చెను.

రాజట్లు కొంతదూరము ముందఱికి నడచినడచి పులహర్షి యాశ్రమమునకు వచ్చెను. పులహర్షి యప్పుడు తన శిష్యులైన ఆత్రేయ, భరద్వాజులసాహాయ్యమున నగ్నిని బ్రజ్వరిల్లఁజేయుచు హోమ మాచరించుచుండెను. 'భామహుఁ' డను నింకొకశిష్యుఁడు సమిధలమోపును దెచ్చి సమీపమున దించెను 'శాక్తాయనుఁ' డను మఱియొకశిష్యుఁడు గురుదేవుని హస్తమునందు *'స్రుక్కు' నుంచుచుండెను. 'గాలవుఁడ'ను శిష్యుఁ డొక్కయెడఁ గుశలును దర్భలును సంసిద్ధములు చేసి వేఱొక్కయెడఁ గదళీపత్త్రమునందు శ్వేతచందనమును దీసి యుంచుచుండెను. అప్పు డాదిత్యభగవానుని అస్తమయసమయకిరణములు అక్కడి వజ్రపర్వతశిఖరమునకుఁ గనకకిరీటాలం

* స్రుక్కు = యజ్ఞమున నుపకరించు వస్తువు, మిక్కిలి గరిటె వంటిది.

కరణము గావించి, గండకీనదీజలములకు రక్తిమప్రదాన మొనరించి, చల్లచల్లగా సంధ్యాదేవి యొసంగిన నీలవర్ణాంబరమును ధరించుచుండెను—ఇట్టిసమయమునం దాఋషివరులందఱును-సుదీర్ఘసౌమ్యమూర్తియుఁ బ్రౌఢవయస్కుఁడు నైన పురుష వర్యుఁ డొకఁడు తమ కుటీరద్వారమున నిలిచియుండుటఁ గాంచిరి. ఆతఁడు బంగారు బుటేదారిపనిఁ జేసిన యెఱ్ఱని పట్టు వస్త్రమును ధరించియుండెను. అట్టిదే యుత్తరీయ మాతని కంఠభాగమునుండి కటిసీమవఱకును వ్రేలాడుచుండెను. వజ్ర కుండలములు కర్ణద్వయమున జాజ్వల్యమానములగుచుండెను. వాని కాంతులు గపోలభాగములపైఁ బ్రతిఫలించుచుండెను. ఆపురుషుఁ డప్పుడు పులహమునిపుంగవునకును, వారిశిష్యులకు ను బ్రణామము లాచరించెను.

పులహుఁ డాశ్చర్యముతో "భరతమహారాజా! ఏమి యీవిధము? పరిచారవర్గమేది? రథమేది? అశ్వములేవి? ఏమియుఁ గనఁబడవేమి? ఇట్టివేషముతో నేకాకివై యరుగు దెంచిన నిన్నుఁగాంచి నాచిత్తము సందేహమొందుచున్నది. ఘోరవిపత్తేదియేని సంభవించెనో, లేక నీవు సంసారమునందు విరాగ ముద్భవించెనో, ఏమైననేమి, కానిమ్ము" అని శిష్యుల వంకఁ జూచి "రాజచంద్రుఁడగు నియ్యతిథి నుపచరింపుఁడ"ని యాదేశించెను. వారును గురునియోగమునచే నతిథిసేవకుఁ బ్రవృత్తులైరి.

పులహుఁడు తన సహపాఠియైన శాక్తాయనుని జూచి యేకాంతముగా నిట్లు ప్రశ్నించెను. "ఇతఁడేనా నిరతాగ్నిహోత్రియై దర్శపౌర్ణిమలు మొదలగు ననేకవిధ పుణ్యకార్యములయందు వ్యాపృతుఁడై, భూతలమునం దక్షయకీర్తిని స్థాపించిన రాజచక్రవర్తి—భరతుఁడు ?"

శాక్తాయనుఁడు—అతఁడే యీతఁడు! ఈతనిగృహమునం దెప్పుడును హోమాగ్నులు నిర్వాపితములు గావు. వందలకొలఁది ఋత్విక్కు లాహుతిప్రదానార్థము హవిస్సులఁ గొని యగ్నులకడ నహోరాత్రములు వ్యస్తులై యుందురు. ఈతనిఁ బోలిన యతిథిసేవాపరాయణుఁడీజగంబున నింకొకఁడు లేఁడు. ఈతఁడు చతుస్స్తోత్రవిధిమూలమున సర్వదా భగవదారాధనము గావించుచుండును.

కుశజలాదులచే నతిథి పూజితుఁ డయ్యెను. పిమ్మటఁ బులహుఁడు శిష్యగణము నవలోకించి వారికి భరతమహారాజును జూపుచు "ఈతఁడు సామాన్యమానవుఁడు గాఁడు. ఈతని పరిపాలనమునకుఁ బూర్వమునం దీభూమికి 'అజనాభ' మను పేరు గలిగియుండెను. ఈ భరతమహారాజుమూలమున నేఁ డిది 'భరతవర్షమ' ని విఖ్యాతి గాంచుచున్నది" అని తెలియఁ జేసెను. పిమ్మట రాజు నవలోకించుచు "మహారాజ శుభాగమనమునకుఁ గారణముఁ దెలియఁగోరుచున్నాను" అని ప్రశ్నించెను. వినీతభావముతో భరతుఁ డిట్లనియెను. "మహర్షి

చంద్రవర్మా! నేను భవదీయాశ్రమమునందు వసించి శిష్య భావముతో నుపదేశలాభము నొందవలయునను మనోరథము తో వచ్చితిని. నేనిఁక సంసారమువంకకు మఱలువాఁడనుగాను. దయాళుఁడవైన నీవు నన్ను శిష్యభావముతో గ్రహించి బ్రహ్మజ్ఞానముఁ బ్రసాదింపుము" అనియెను.

మహర్షియైన పులహుఁడు మందహాసము గావించి "రాజా! అయ్యది యుక్తమపరిసంగమే కాని నీవిఋషి జీవనమునందలి కష్టముల నోర్వఁజాలుదువే" అనియెను.

భరద్వాజుఁడు నవ్వుచు నిట్లు పలికెను. "ఓహో రాజా! నీవు క్షాత్రమూర్తివి, క్షత్రియనరవరుల గృహధర్మముల కా ధర్మరూపములైన సమస్తపుణ్యకార్యములును నీవాచరించుచు నే యున్నవాఁడవు, కాని నివృత్తిరూపమైన బ్రాహ్మణధర్మము మిక్కిలి కఠినమైనదిసుమా? రాజోత్తములకుఁ బంచదశవర్ష ములు పైఁబడినప్పుడు భార్యాసమేతముగా వానప్రస్థమునం దుండుట ధర్మము. అది నీపక్షమునందనాయాసముగా సాధ్యము గాఁగలదు, కాని మహర్షులశిష్యులవలె నీకీవయసునందు దుర్గమ మైన తపమొనరించుట సులభముగునే."

భామహుఁ డిట్లుపలికెను—"మహారాజా! వల్కలము లు ధరింపవలయును; భూమిపై శయనింపవలయును; నిరా మితదినములం దుపవాసము లొనరింప వలయును. [illegible] ఫలమూలాదులవలననే జీవనధారణము చేయవలయును. [illegible]

ధాత్రిములు దేహము నొక యంత్రమువలె నియమితము గావించి సంయమవ్రతుఁడవు గావలయును—మనస్సంబంధము లైన విక్షేపవిక్షేపము లన్నియు దూరముచేసి నిశ్చయాత్మక మైన బుద్ధిని బ్రహ్మాను సంధానింపవలయును. కుశలు, తృణములు, యజ్ఞకాష్ఠములు, హోమానలము మున్నగునవి సంగ్రహించుటయందును, గురుపరిచర్యలయందును, హీన భృత్యునివలెఁ బనిచేయుట నభ్యసింపవలయును. మహారాజా! నామాటలకు విరక్తుఁడవు గావలదు! ఈసాత్త్విక ధర్మపథము నీ వింతకాలమునుండి యభ్యసించుచున్న రాజసికధర్మమువంటిది గాదు సుమా!—ఇది దుస్సాధ్య మైనతపస్సు—".

అత్రేయుఁడు భరతుంగాంచి—"రాజా! మము బోంట్లు బాల్యమునుండియు నీతపోవృత్తి నభ్యసించుచున్నాము. సంపూర్ణముగా నిప్పటికైనను సులభముకాలేదు. అట్టిచో నీ వీవార్ధకవయస్సునందు బ్రహ్మచర్యారంభమునకుఁ గడంగుట వలన నేమిప్రయోజనము?" అనియెను.

పులహమహర్షి శిష్యులను జూచి "ముముక్షువై వచ్చిన యీమహాపురుషుని తపఃప్రయత్నమునకు మీరేలవిఘ్నములు కల్పించెదరు?—విశ్వామిత్రాదులైన క్షత్రియులు సిద్ధఋషులు గాలేదా? ఈతఁడుమాత్ర మట్లేల గాఁగూడదు? అని పలికి భరతు వీక్షించి "మహారాజా! నీవీయాశ్రమమునందుండుటకు స్థిరసంకల్పుఁడవై యుంటివా?" అని యడిగెను.

రాజు—ఋషివర్యా! ఇచ్చట నాలక్ష్యము కుదిరియున్నది, నీవు నన్నుఁ గరుణించి నీశిష్యునిగాఁ బరిగ్రహింపుము.

పులహార్షీశ్వరుని దయాన్వితమైన యాజ్ఞ ననుసరించి రాజు వల్కలములను ధరించెను. మహారాజైన భరతుఁడు గండకీ నదీజలములయందుఁ దన బంగారుపట్టువస్త్రములను విసర్జించెను. కర్ణములయం దుజ్జ్వలములగుచున్న యమూల్యములైన హీరకకుండలములను గూడ నాతఁ డాజలములయందే విడిచి పుచ్చెను. అప్పు డాతఁడు—తన తండ్రియైన ఋషభదేవుఁ డీ యుజ్జ్వల దివ్యసుందర వజ్రకంకణములనిమిత్తము శశకుంభ దైత్యునితో ద్వాదశవర్షకాలము ఘోరయుద్ధ మొనరించెనను సంగతి యొక్క-మాహాత్మ్యమును స్మరించుకొనఁ జొచ్చెను.



# జడభరతుఁడు.

## మూఁడవ ప్రకరణము.

శిష్యులందఱు విస్మయాపన్ను లగుచుండిరి. దీనుఁడు, హీనుఁడు నగు బాలునివలె నాప్రౌఢవయస్కుఁడైన భరతుఁడు ఆరాజపరిచర్య, సమిధలును, కుశలును గైకొని చేతులు జోడించుకొని సర్వదా మహర్షియాజ్ఞకు నిరీక్షించుచుండెను. ఏనుఁగుదంతములచే నిర్మింపఁబడిన హంసతూలికాతల్పములపై దాసదాసీజనుల పరిచర్యల సుఖించుచు శయనించుచుండు రాజనందనుఁడు కఠోరభూప్రదేశములం బండుకొనుచుఁ బరిమితసమయములందు మాత్రమే నిద్రాలాభము నొందుచుండెను. ఎవ్వని యభీష్టములైన యాహారపదార్థములకొఱకుఁ గార్యదక్షులైన వంటలవాండ్రనేకులు నిరంతరము వేర్వేఱ పనికల్గియుండిరో, యాతఁ డిప్పుడు, సంయమభావముతో సానందపూర్వకముగాఁ గషాయవన్యఫల మూలములను భుజించి తృప్తుఁడగుచుండెను. ఋష్యాశ్రమమంతయు నాతఁడు స్వహస్తములతోఁ దుడిచి కలయంపులు సల్లి రంగవల్లికలచే నలంకరించుచుండెను. వేకువజామున నిద్రనుండి లేచి గండకీ నదీసలిలములయం దవగాహన మొనరించి, దీపక, పూ[illegible],

కుంభకములను మూఁడువిధములఁ బ్రాణాయామముచే నంత శ్శుద్ధి చేయుట యభ్యసించుచుండెను. "ఆహా! యీతఁడు బ్రాహ్మణులలోఁ దేజస్వియైన బ్రాహ్మణుఁడు" అని ఋషి కుమారులు విస్మయావహులై చూచుచుండిరి. భరతునిపుణ్య జీవన మీయాశ్రమమునం దొక యభినవప్రభావవిస్తృతిఁ జెందుచుండెను.

ఒకదినమునందుఁ బులహుఁడు భరతునిఁగాంచి "మహా రాజా! నీసాధన మతిత్వరితగతిని బర్వుచున్నది. బ్రాహ్మణ శిష్యులకంటెను నీవు సాధనపథమునందు శీఘ్రాతిశీఘ్రముగా నత్యల్పకాలములో నగ్రసరుఁడవగుచున్నావు. ఈవిధముగా బ్రాహ్మణునివలె నీసాధనము నెల్లకాలముఁ బరిపాలింపఁ గల్గితి వేని నీవీ యాశ్రమమును ధన్యముఁ జేయఁగలవు. సందియము లేదు" అని పలికెను.

పులహుఁడు, రాజశిష్యుని ముఖమండలమునం దత్యల్ప కాలముననే, బ్రహ్మానందలాభచిహ్నములు సకలముఁ బ్రకటము లగుటఁ జూడఁగల్గెను. ఆతని నేత్రకమలములయం దాయానంద రసభావములు పట్టువడుచుండెను. ఆబ్రహ్మజ్ఞానవికాసమునం దెట్టియపూర్వవినయము నెట్టి జీవప్రీతియు సంచారము చేయు చుండెనో, అట్టిసంచారము నాఋషీశ్వరుఁ డాశిష్యోత్తముని యందుఁ గాంచి యానందించుచుండెను. "ఇట్టి యల్పకాలము లో నిట్టి సాధనఫలమును బ్రత్యక్షముగా నే నెప్పుడుఁ జూచి

యుండలేదు. నిశ్చయముగా నీతఁడు బహుజన్మతపస్సుచేఁ గన్తృతియముఁ బొంది జగమునం దవతరించియుండెను. కాని యిట్టి పుణ్యప్రభావముగల యీతఁడు, బ్రాహ్మణకులమునందు యోగసాధకుల మధ్యమునం దుద్భవింపక క్షత్రియకులమునందు రాజసికభావములనడుమ నేల యవతరించెనో" అని ఋషివర్యుఁడు భావింపఁజొచ్చెను.

పిమ్మటఁ బులహుఁడు భరతునకుఁ గఠినతరమును, దుస్సాధమునైన యోగమార్గమును జూపెను. భరతుఁడును సమాహితుఁడై ఋషిప్రవరుని యుపదేశము ననుసరించి భగవత్సేవకుఁ బ్రవృత్తుఁడయ్యెను. అతఁడు క్రమముగాఁ గఠోరవ్రతమునందు దీక్షితుఁడుగాఁ జొచ్చెను. అతఁడు మూఁడు దినముల కొకసారి మాఱు కపిత్థఫలములును, బదరీఫలములును భుజించుచుండెను. ప్రతిదినము నాతఁడు జీర్ణములైన తృణపత్రములవలన సామాన్యముగా నాఁకలి నుపశమింపఁ జేసికొనుచుండెను. అతని దేహము క్రమముగాఁ దన్మయత్వమున నిశ్చేష్టితమై పోవుచుండెను. అతని యంతరాత్మ కేవలము, అపూర్వమైన భగవద్రూపమును ధారణ చేయుటకు నిరంతరపరిశ్రమ మొందుచుఁ దత్పాదాంబుజధ్యానమునందు లీనమైయుండెను.

కృతార్థుఁడైన భరతుఁ డీవిధముగా భగవానుని విరాట్స్వరూపమును ధారణ చేయుచుండెను. సమస్తవనపుష్పములు మాలికారూపమున నా విరాట్స్వరూపుని విశాలవక్షమున శోభా

సంపన్నము లగుచున్నట్లును, భూమ్యాకాశముల యంతరాళ మునందలి సస్నిగ్ధనీలకాంతులు, ఆజ్యోతిస్స్వరూపునిఁ దన కన్నులలోఁ గట్టివేయుచున్నట్లును, ఆకాశమునందలి నక్షత్రములు దివ్యాభరణములవలె నావిశ్వరూపుని దేహమునందు దీప్తిమండలము లగుచున్నట్లును, చంద్రసూర్యులు మకుటాభరణములై యుజ్జ్వలకాంతిసంపదల నొలయించుచున్నట్లును, ఆశ్రీపాదమునుండి కరుణారసధారవలె గంగాధార కలకల నినాదమునఁ బ్రవహించుచున్నట్లును, పాపాత్ములైనయసురుల సంహారము కొఱకుఁ గొన్నియాయుధములు హస్తములందుఁ బ్రకాశమానము లగుచున్నట్లును, భక్తుల కభయచిహ్నస్వరూపమై తేజరిల్లుచున్న పద్మ మొకహస్తమునందు ధరింపఁబడినట్లును, మఱియు నాతని పాణి, పాంచజన్య శంఖస్వరసమ్మేళనమున మేఘనినాదమువలె విశ్వాంతరాళమునఁ బ్రతిధ్వనించుచున్నట్లును, అతఁడు గాంచుచుండెను.

ఆదృశ్యమును జూచుచుఁ జూచుచు రాజర్షి చక్షువులు పద్మలీనములైనభ్రమరములవలె నూర్ధ్వాకాశాంతరాళమున విలీనము లగుచుండెను. అతని దేహమంతయు నానందతేజోమయమై ప్రకాశించుచుండెను. అట్టిస్థితియందున్న యారాజర్షిని జూచినవారు “గండకీనదీతీరమున దేవతలెవ్వరో యోగసాధన మొనరించుచున్నా” రని తలఁచుచుండిరి.

---

# జడభరతుఁడు.

## నాల్గవ ప్రకరణము.

అప్పుడప్పుడు పట్టపుదేవి యైనపంచజని ముఖచంద్రుఁడు ఆతని హృదయాకాశమున నుదయించుచుండెను. రాచనగరునందలి యానందనికేతనము గూడ నాతనిస్మృతిపథమునం దొక్కొక్కమా రుదితమగుచునే యుండెను. వెంటనే యాతఁడు బాధితుఁడగుచుండెను, గాని యాతపస్వి ప్రాణాయామాదుల వలన మనోగతులకును, సకలేంద్రియసంచారమునకును నిరోధ మొనరించుచు ధ్యానపరాయణుఁ డగుచుండెను. ఇఁక నాతనిని సంసారభావనాసంబంధ మైనక్లేశ మింతుకయు నంటఁజాల కుండెను. మహారాజైన భరతుఁడు రాజర్షి యని, యెల్లెడల నాతని కీర్తిమహిమలు కీర్తింపఁబడుచుండెను. పుణ్యాత్ములైనమహర్షుల పవిత్రవదనములనుండియు నాతని యశము ప్రశంసితము గాఁజొచ్చెను.

రాజర్షి యింత స్వల్పకాలములో యోగమార్గమునం దెంతయోదూర మగ్రసరుఁడయ్యెనని పులహమహర్షిశిష్యులు-గాలవుఁడు, భరద్వాజుఁడు, భామహుఁడు మొదలగువారు గూడ నంగీకరింపవలసినవారైరి.

ఒకనాఁటి యుదయకాలమునందు భామహుఁడు రాజర్షియైన భరతునిసన్నిధిని కూరుచుండి "రాజర్షివర్యా! తపము నిర్విఘ్నముగా జరుగుచున్నది గదా?" అని కుశలప్రశ్నము గావించెను.

ప్రసన్నవదనుఁడై భరతుఁడు "పులహమహర్షియాశ్రమసన్నిధానమున, గండకీనదీతీరమున, దపోమార్గమున కంతరాయము గలుగఁగలదా?" అని పలికెను.

భామహుఁడు—"మహారాజా! నీవు సంసారాశ్రమమును ద్యజించి యిచ్చటికి వచ్చి యున్నావు వనవాసి వగుచున్న సంసారచింతనుండి రక్షింపఁబడుట [illegible] యున్నాను. నీచే విడువఁబడిన నీదారపుత్త్రాదులు [illegible] నీచింతనమునం దవులుచు నీయోగమార్గమున కడ్డము కాఁగలరేమో?" అనియెను.

భరతుఁడు నిశ్చింతహృదయుఁడై నవ్వుచు- "అట్టిసంశయమించుకయు వలదు. చిత్తసంయమము నభ్యసించి, ఈషణాత్రయాదిమోహమును హృదయమునుండి దూరము గావించియుంటిని—నాకీజగత్తునం దిప్పుడు సామాన్య కీటపతంగము లెట్లో, పట్టపుదేవియైనపంచజనియు, ప్రియపుత్త్రులు, నట్లే— నే నింక పరిజనమోహమునకు నశక్తుఁడనుగాను, నాహృదయము నం దన్ని జీవులయెడల భూతదయ సమానమై యున్నది" అని పలికెను.

“ఆకరుణామయుఁడైన భగవానుఁ డొక్కఁడే కరుణించుటకు సమర్థుఁడు. మనమందరముఁ గరుణాపాత్రులము మాత్రమేయైయున్నాము.” అని చెప్పి బ్రాహ్మణుఁ డచ్చటనుండి వెడలిపోయెను.

పిమ్మట మహారాజు స్థిరచిత్తుఁడై తర్పణార్థము గండకీనదీజలములఁ బ్రవేశించెను. అనన్యమనస్కుఁడై యాతఁడు భగవానుని స్మరించుచుండెను.

ఆకస్మికముగా భయంకరమైన గర్జనధ్వని యొకటి బయలుదేఱి రాజునికి యోగభంగము గావించెను. ఆతఁడప్పుడు కన్నులు విప్పి యాశబ్దమును వినఁజొచ్చెను. గండకీనదికావలి యొడ్డుననున్న వజ్రపర్వతగుహనుండి యొకసింహముగర్జించెను.

ఆశబ్దము గంభీరమేఘగర్జనమువలె దూరమునుండి భయంకరముగా వినవచ్చెను. రాజప్పు డుపేక్షాభావముతోఁ దనకన్నులు పునర్నిమీలితములు గావించుకొనఁబోవుచుండఁగాఁ గరుణాకరమైన యొక దృశ్యమాతని కన్నులఁ బడియెను.

గండకీనదీ పశ్చిమతీరమునందుఁ దృణగుల్మములలో నిండుగర్భిణియైన యొకహరిణి ప్రవాహోదకము నాప్యాయనముగఁ గ్రోలుచు నాసింహగర్జనమును వినియెను. వెంటనే యది విభీతనేత్రములతో నలుదెసలఁ దిలకించుచుఁ బ్రాణరక్షణార్థ మానదీజలములలో నుఱికెను. ఆఘనోల్లంఘనములో నాహరిణి యాజలమధ్యమునందే ప్రసవించి [illegible]

లయిన నేత్రములతో రాజ్షి నీక్షించుచుఁ బ్రాణత్యాగముఁ జేసెను.

రాజర్షియంతయుఁ జూచుచుండెను. సద్యోజాతమైన యాకురంగశాబకము నదీతీర సమీపజలంబుల మిలమిలలాడు చుఁ గన్పట్టుచుండెను. రాజుహృదయ మపారకరుణారసముచేఁ గరఁగిపోయెను. అతఁడు వెంటనే పరువిడి జలములందున్న హారిణశిశువును లేవనెత్తి తీసికొనివచ్చెను. శిశువు నిర్జీవమైనట్లు నిశ్చేష్టమై యుండెను. రాజర్షి తత్క్షణము దానిని దనకుటీరము నందలి హోమాగ్నికడకుఁ దెచ్చి యాయగ్ని వేఁడిమిచే దాని దేహమును గాచుటకు మొదలుపెట్టెను. అగ్నిసెగ దగిలిన కొంతసేపటి కాశిశువుమేనఁ బ్రాణవాయువులు సంచరించు చున్నట్లు గ్రహించి రాజు సంతుష్టుఁడయ్యెను. మఱికొంతసేపటి కా హారిణడింభకము గన్నులువిప్పి సహజసుందరములైన చపల దృష్టులతో నాతని మోము నవలోకింపఁదొడంగెను. రాజర్షి కామాతృహీనమైన లేఁడిపిల్లచూపులయందు హృదయవిదారక మైన యొక నిర్భరభావము పొడకట్టెను. మృగడింభక మాతృస్నేహవాంఛిత మధురములైన సుందరావలోకనములు వేగముగా నాతని హృదయసీమ నడఁగుచుట్ట నాటికొనియెను.

కరుణాస్వరూపుఁడైన భగవానుఁడు తన కామృగశిశువు ను దానరూపముగా దయచేసినాఁడని భరతుఁడు నిశ్చయించు కొనియెను. "అనన్యమృత్యుముఖమునుండి దీని నెట్లో రక్షించు

కొంటిని. కాని నేఁటినుండి దీనిని నే నెట్లు పోషించి పెంపఁ గలను ?" అని యాతఁ డాందోళనము పడఁజొచ్చెను.

పిమ్మట నాతఁ డాహరిణశిశువు నొడిలో వేసికొని బయలుదేఱి యాకొండపల్లెలయందలి గృహస్థుల గృహము లకుఁ బోయి యించుక యావుపాలను దెచ్చి దానికిఁ బోసెను. ఇంటింట బిచ్చమెత్తుచు గోక్షీరములు సంపాదించుచు నను దినము నీవిధముగా దానికిఁ గడుపారఁ ద్రావించి తక్కినపాలు దన కమండలువునందు భద్రపఱచుకొనుచుండెను.

బాలెంతరాలైన తల్లి తన పసినిసుఁగునకు నియమిత కాలములం దపారవాత్సల్యముతో, నత్యంతజాగరూకతతో నేవిధముగా స్తన్యము లొసఁగుచుండునో, ఆవిధముగా నీ రాజర్షి తన కమండలువులోని పాలను హోమానలమునందు వెచ్చ పఱచుచు ముత్తెపుఁజిప్పలం బోసి హరిణశిశువునకు నియమిత కాలములందుఁ ద్రావించుచుండెను. హోమానలమునకొఱకు సంగృహీతములైన సమిధలను లేఁడిపిల్లకుఁ బాలుగాచుటకై రాజర్షి మాటిమాటికిఁ బ్రజ్వరిల్లఁజేయుచుండెను. క్రమముగా నాతఁడు ప్రాతఃకాలమునందే గాక మధ్యాహ్నకాలమునందుఁ గూడ క్షీరసంపాదనమునకుఁ దిరుగవలసివచ్చెను. మఱియు నీతఁడు తనకాలములోఁ జాలభాగము మృగశిశువునకుఁ బాలు గాఁచుటతోను బాలుపోయుటతోను వ్యయపఱచుచుండెను. ఇంకను శేషించియున్నకాలములో రాజర్షి లేఁడిపిల్ల నొడిలోఁ

జేర్చికొని దానిమోమును, గంఠమును గోఁకుచు వాత్సల్యరస నిమగ్నుఁ డగుచుండెను. మృగశాబకంబును సుఖపారవశ్యంబున గన్నులు మోడ్చుచు నాతని యాదర మందుకొనుచుండెను. ఒక్కొక్కమాఱు కనుఱెప్పల విప్పి సంతృప్తిసూచకములైన సౌహార్దనిరీక్షణములతో నది నీరవమై రాజును జూచుచు, మరలఁ గన్నులు మూసికొనుచుండెను. "అహా! ఈమృగ శిశువు స్వభావము కేవలము నరశిశువు స్వభావమువంటిదే?" అని యాయాసమయములం దంతరంగమున భావించుకొనుచు రా జానంద మొందుచుండెను. దేవతార్చనమునకు సంపాదించు కొనిన కోమలదూర్వాంకురములును గుశాంకురములును దన నవనవోద్గతములైన దంతాగ్రములతో హారిణపోత మొక్కొక మాఱు కొఱుకుచుండుటఁ జూచుచు, రాజు "భగవానుని యర్చనసామగ్రుల నెంగిలిచేయుచున్నావా?" అని కపటక్రోధ ముతో దానిని ముచ్చటలాడుచుండును. ఆమాటల కులికి యది గంతులువేయుచు, మరలఁ గరుణపాత్రములైన నేత్ర ములతో రాజువంకఁ జూచుచు నిలచుచుండును. రా జప్ర మోదాతిశయముతో దానిని బట్టి యొడిలోఁ జేర్చికొని అల్లరిచేసి బ్రతిమాలుకొనుచున్నావా? తిన్నగా నుండుము. ఎవ్వాడు నల్లరిచేయకుము" అనుచుండును.

ఒక్కొక్కమాఱు రాజు నిల్వఁబడి భగవద్ధ్యానము నా రించుకొనునప్పుడాహారిణపోతము తన నయనానందా(గముల)తో

నాతని వల్కల పరిధానాంచలమును లాగుచుండును. రాజప్పుడు భగవచ్చింతనమును మఱచుచు దానివంకకే చూపులు నిగుడ్చుచు, “నీకీస్నేహ మెవరునేర్పిరి? ఒక్కనిమిషమైనను నన్ను విడిచి యెక్కడ నుండఁజాలవు?” అని లాలించుచుండును.

ఒకదినమున రాజర్షి జప మాచరించుకొనుచుండఁగా దూరమునందున్న జంబుక మొక్కటి యాతనికిఁ గానవచ్చెను. రాజప్పుడు చేతనున్న జపమాల నచ్చటనే వదలివేసి గుభాలున లేచి యాచెంత నాడుచున్న లేఁడిపిల్లకడ కొక్కపరువునఁబోయి దాని నెత్తికొని తనకుటీరములోనికిఁ దెచ్చి యచ్చట భద్రపఱచెను. ప్రాంతములనుండు నడవి నక్కలుగాని తోడేళ్లు గాని తన కురంగ డింభకము నెత్తికొనిపోవునేమో యను భయముచే నారాజర్షికి రాత్రులయందు సుఖనిద్ర లేకపోవుచుండెను రాత్రులయం దాతఁడు మాటిమాటికి లేచుచుఁ దన కుటీరకవాటబంధనము పదిలముగ నున్నదో లేదో యని చూచుచు మరలమరల దానిని బిగించుచు, జాగరూకుఁ డగుచుండెను. వనమునందలి దృఢలతలను దెచ్చి వానిచేఁ గట్టి, కవాటమును భద్రముగా బిగించుచుండును. రెండుమూఁడు దినములకే లత లెండిపోవునని యూహించి వానిని దీసివైచి సుదృఢములైన పచ్చితీగలను మఱలఁ దెచ్చుటకు వనమందు వెదకుచుండును. ఒక్కప్పుడు లేడిపిల్ల కుటీరమునం దొక్కెడఁ

బందుకొని నిద్రించుచుండఁగా, రాజు తన జపమాలను బ్రేళ్ల తోఁ ద్రిప్పుచునే దానికడకుఁ బోయి ప్రేమాతిశయ మొలుక దానిమోము ముద్దిడుకొనుచుండును. సమిత్కుశాదులకొఱకు వనమున కేఁగునప్పు డాతఁడు మృగశిశువును మూఁపున నెత్తి కొని వెంటఁబెట్టుకొనియే పోవుచుండును. గృహమునందుంచి పోయినచో, వనమృగములు దాని నెత్తుకొనిపోవునేమో యని యాతనికి భయము. రాజర్షికుటీరప్రాంతములయందుఁ దిరు గాడునప్పుడు మృగశిశువు, అనుగతభృత్యునివలె, వెనువెంట నంటి తిరుగుచుండుట నెఱింగి మాటిమాటికి మోమునుమరల్చి దానిని జూచుకొనుచు నాదృశ్యమున కాతఁడు పరమానంద భరితుఁ డగుచుండును.



# జడభరతుండు.



## అయిదవ ప్రకరణము.

ఒకదినమునఁ బులహుఁడును, బులస్త్యుఁడును రాజర్షి యాశ్రమమున కరుదెంచియుండిరి. రాజప్పుడు జపముఁ జేసికొనుచుండెను. ఆతని కరాంగుళులు తులసీమాలపై నతి వేగముగాఁ బరువులిడుచుండెను. కాని యాతని భావము మాత్రము పరమాత్మునిపైఁ దవిలియుండలేదు. కన్నులు మూసికొని యాతఁడు "కుటీరప్రాంతమునందు దర్భాంకురముల కడ లేడిపిల్ల లేదు—నిన్నటియుదయమున నది సామీప్యమందలి కొండపల్లియలోని పొలమునకుఁ బోయినప్పుడు ఆ పొలములో వాకిల్లుపూలనడుమ, నతిరమణీయముగాఁ బెరుఁగుచున్న దూర్వాంకురముల నమితాహ్లాదముతో మేసినది. నేఁడుగూడ దాని నచ్చటకుఁ దీసికొనిపోయి మేఁతకు విడిచివచ్చి సామీప్యమునఁ గూర్చుండియే జపముచేసికొనుచు దానిని జూచుకొనుచుండవలయును" అని భావించుకొనఁజొచ్చెను. మఱియు "కోమలారుణకాంతిసుందరమైన యాహరిణశింభకము లేఁజిచ్చిక మేయుచు నాడుచుండఁగా నాఁకలిగొనియున్న యడవినక్క యక్కడనుండి దానిని తొంగిచూచుచున్న

ట్లును, తనచేత నవ్వును కట్టలేనట్లును — అంతలో నింకొక సృగాలము, కురంగశిశుసమీపమునకు వచ్చి దానిపైఁ బడ నుంకించుచున్నట్లును, దాను వెంటనే పరువిడిపోయి ప్రాంత వనమునందొక సాలవృక్షశాఖను విఱిచి తెచ్చి యాకఱ్ఱ చేతఁ బట్టుకొని పెద్ద కేకలు పెట్టుచు నంతటఁ దిరుగుచున్నట్లును, ఆశబ్దమునకు నక్కలన్నియుఁ బాఱిపోవుచున్నట్లును, ఆతని హృదయాకాశమున మఱియొక దృశ్యము పొడకట్టెను. ఈ సమయమునందు లేడిపిల్ల యాతనివెనుకనుండి యాతనివల్కల పరిధానమును నాకుచు నిల్వఁబడియుండెను. రాజాస్పర్శమును గ్రహించి పరమసుఖ మనుభవించుచుండెను.

పులహుఁడును, పులస్త్యుఁడును రాజుసమ్ముఖమునందే నిలచియుండిరి. రాజు వారు వచ్చినజాడ తెలిసికొనలేదు. ఆతఁడు జపమునందు నియుక్తుఁడై యుండెను; కాని యాతని చిత్తముమాత్రము లేడిపిల్లపై హత్తియుండెను.

పులహుఁ డప్పుడు గంభీరదీర్ఘస్వరముతో “రాజా! ఏమిచేయుచుంటివి? నీవు యోగభ్రష్టుఁడవై పోయితివి. ఈ యాశ్రమమునం దుండుట నీకింక క్షేమకరముగాదు” అని పలికెను.

రాజీమాట సమాధినుండి లేచి ఋషులిర్వురకును ప్రణామము లాచరించెను. వారిని జూచి “ప్రాణాపాయము నుండి తప్పించి నే నీలేడిపిల్లను రక్షించియుంటిని. ఏయుప

రాశమము నెఱుఁగని—తల్లి లేని—దిక్కుమాలిన—యీమృగ
జీవము నుద్ధరించుభారము నాపైఁ బడినది. స్వామీ! ఇది
యేనా శాయెడల మీకుఁ గలిగిన విరాగమునకుఁ గారణము?"
అని యడిగెను.

పులహుఁడు—రాజా! ఏమాయనుండి తప్పించుకొనుటకు నీవు గృహాశ్రమమును విడిచి వచ్చితివో ఆమాయాచక్రమునం దీసామాన్యహరిణశిశువు నిన్ను దవులొక్కనఁ జేసినది. ఇంక నీ వీయాశ్రమమునుండి గృహమున కేఁగుట మంచిది.

రాజు—స్వామీ! ఇది మాయ యెట్లగును? ఇది జీవదయగదా? ఇట్టి దయానుగమనము మోక్షమార్గమునకుఁ బ్రతిబంధముగాదు. అత్యంతమైన దురవస్థలో మృత్యుముఖమునం దున్న యొకజీవమును రక్షించి పెంచుట యన్యాయమొనరించుట యెట్లగును?

పులహుఁడు—రాజా! అట్టి దురవస్థలోనున్న జంతువును నీవు దయాపరుఁడవై రక్షించితివి. ఇది యుత్తమధర్మమే. కాని నీ వాపిమ్మట దానిని బిడ్డవలెఁ బెంచుటకు వెంటనే యే గృహస్థునికైన సమర్పించియుండవలసినదిగదా?

రాజు కటాక్షమాలిక లాసమయమునం దతిశయప్రేమ పాశములచే హరిణశిశువునం దాబద్ధము లై పోయెను. అతఁడప్పుడు దానిని దువ్వుచు "అట్లయిన నీకఁ గరుణకు స్థాన మెక్కడనున్నది?" అనెను.

## అయిదవపరిచ్ఛేదము.

పులస్త్యుఁ డప్పుడు పులహుని చేయిపట్టుకొని "మన మిఁక నుండరాదు. రాజు కుతర్కమునకు దిగుచున్నాఁడు. ఇప్పు డీతనిబుద్ధి సంపూర్ణవిభ్రాంతి నొందియున్నది. అగ్నిశలాకచే భగవంతుఁ డీతనిజ్ఞాననేత్రమును మరల వికసింపఁజేయగలఁడు. మన యుపదేశము లిప్పు డీతనికిఁ దలకెక్కవు. మాయాపటలము లీతని కన్నులఁ గ్రమ్మియున్నవి. ఆకనులయందు బ్రహ్మానందలక్షణము లంతరించిపోయినవి." అని పలుకుచు నాతని వెంటఁబెట్టుకొని యటనుండి వెంటనే వెడలిపోయెను. రా జప్పుడు నిశ్చింతహృదయముతో లేఁడిపిల్లను దరిఁజేర్చుకొని చేతులతో దాని కంఠమును గోఁకుటకుఁ బ్రారంభించెను.

ఈవిధముగాఁ దరువాత రెండేండ్లు గడచినవి. హరిణశిశువు క్రమముగాఁ బెరిఁగి పెద్దదగుచున్నది. రా జిప్పుడు బహిర్వేషమునకు సన్యాసియే, కాని యాతని యాంతర్యమంతయు సంపూర్ణగృహస్థభారముతో నిండిపోయినది. ఆతని కమండలు విప్పుడు లేఁడిపిల్లకు జలపాత్రముగాఁ బరిణమించినది. ఆతని దండము వ్యాఘ్రాదిక్రూరజంతువులను బెదరించు యంత్రరూపముగా మారినది. ఇప్పు డిఁక నాతని ప్రియహరిణము అడవినక్కల కాశగొల్పు వస్తువుగాదు. అది బలసి బలిష్ఠమై యుండెను. ఇప్పు డది పులులనడుమనుండియు లంఘించి పోవుటకు నేర్చియున్నది. రా జప్పుడుగూడ నుద్దేశపూర్వకముగా నెండుచితుకలను సంగ్రహించుచున్నాఁడు గాని

యవి హోమానలమునకు మాత్రము గావు-శీతకాలమునందుఁ గురంగమును కాఁగుటకుఁ జలిమంటలు వేయుటకు—వర్షకాలమునందు వానచేఁ దడిసిన హరిణదేహమును సమ్మార్జనమొనరించుటకు నాతఁడు వల్కలములను జాగ్రత్తపఱచి యుంచెను. నవీనదూర్వాంకురములను విస్తారము రాజు ప్రోగుచేయుచునే యున్నాఁడు గాని మునుపటివలె దేవతార్చనానిమిత్తమని చెప్పుటకు వీలులేదు. లేఁడిపిల్ల వర్షములోఁ దడియుచు మేఁత మేయఁజాలదనియో మఱియెందులకో యాతఁడిప్పుడు దానిని దఱచుగా బైటికిఁ బోనిచ్చుట లేదు. కావున దాని మేఁతకొఱ కాతఁడాలేఁతగఱిక వినియోగింపవలెను.

ఒకనాఁడు గండకీనదీతీరమునందు రాజు, ఆహ్నికక్రియలలో నియుక్తుఁడై యుండఁగా లేఁడిపిల్ల, రాజుకన్నులకించుక మఱుగై యెచ్చటనో తిరుగాడుచుండెను. అతఁడప్పుడు తహతహపాటుతో వ్యగ్రచిత్తుఁడై విభ్రాంతునివలె నలువంకల దృష్టిపాత మొనరింపసాగెను. అంతలో నాతని చెవులకు లేఁడి యడుగులచప్పుడు వినఁబడుటచే నాతఁడూరటఁజెందిన చిత్తముతో దీర్ఘనిశ్వాసమును విడిచి జపమాలను జేకొని మరలఁ ద్రిప్పసాగెను.

# జడభరతుండసు.

## ఆఱవ ప్రకరణము.

రాజు నేఁడు కుటీరములో లేఁడిపిల్లను భద్రపఱుచుకొని గండకీనదికి స్నానమున కేఁగెను. ఆసమయమున వన్యకురంగము లనేకములు గుంపుగూడి యాశ్రమమార్గమునుండి పరువులు వాఱుచుఁ బోవుచుండెను. భరతుని హరిణ మప్పు డావంకకుఁ జకితదృష్టులతోఁ జూచుచుఁ బసిపట్టుచు నేదియో యపూర్వ మైన యానందానుభవమునకు లోనయ్యెను. వెంటనే యది కుటీరమునుండి యెటులో యీవలఁబడి యాగుంపుతోఁ గలసి పోయెను. అప్పు డది యొకవన్యహరిణమును వెన్నంటి గంతులిడుచు నాగుంపుతోఁ బోఁజొచ్చెను. రాజాశ్రమమువంకకుఁ దిరిగి చూడనైనను జూడలేదు. ఎవరుపెంచిననేమి? ఎక్కడఁ బెరిఁగిననేమి? ఆహా! సజాతీయ సహవాసమునందేకదా జీవికి సుఖమున్నది? అప్పుడు మధ్యాహ్నకాలము దాఁటిపోయినది. ఇట్టిసమయమున లేఁడిని, ఒడలుదోమి స్నానమాడించుట రాజునకు నిత్యకృత్యములలో నొకటి. రాజు నేఁడుఁగూడ నెప్పటివలె హరిణాభ్యంగనము నిమిత్తము, తన కమండలువునింప జలముకొని కుటీరమునకరుదెంచెను.

అంతటఁ గలయఁజూచెను. హరిణ మగపడలేదు. అప్పుడా దానవుఁడు వ్యగ్రభావుఁడై యుత్కంఠతో దిక్కులకుఁ జూచుచు దాని నెలుఁగెత్తి పిలువఁజొచ్చెను.

ఆ నిర్జనారణ్యమునందుఁ గరుణామయమైన యా యాహ్వానము నలుదిక్కులం బ్రతిధ్వనింపసాగెను. రాజువల్కలములు జాఱిపోవుచుండెను. అతఁడు తన్నుఁ దా మఱచి లేఁడి కొఱకుఁ దిరిగి తిరిగి పరుగులెత్తుటకు మొదలుపెట్టెను.

హిమాలయశిఖరములలో నొకదానికి ధవళగిరియని పేరు. దాని పాదమూలమునుండియే గండకీనది ప్రవహించుచుండెను. ధవళగిరి సామీప్యమున ధూమరాశివలెఁ గృష్ణవర్ణముతో నింకొక యెత్తైన శిఖరముండెను. దీనిపేరు దేవసఖ. దేవసఖ నంటి దాని యపరదిక్కునందు ధూసరవర్ణముతో, విరళశృంగములతో నొప్పి వేఱొకకొండ కలదు. దీనిపేరు వజ్రపర్వతము. దీని యుపత్యకాప్రదేశమునందు 'లోధ్ర, మొల్ల' మొదలగు నోషధీసంచయ మనంతముగాఁ గలదు. పూర్వదిశయం దింకొక శైలమున్నది. ఇది యేకశృంగము గల్గి యాకాశపటమునందలి జగ్గునువలె దర్శనయోగ్యమై యుండెను. దీనిపేరు సుదర్శనము. ఈ కొండలనడుమనుండి ప్రచురవేగముతో గండకినది ప్రవహించుచుండెను. పర్వతదుహితయైన గండకీనది విసిర్మలజలపూర్ణయు, విస్రుతవేగశీలయునై యుండెను. ఈ నదీతీరమునందు వెఱ్ఱివానివలె రాజర్షి

పరువులెత్తుచుండెను. దేవదత్తా! దేవదత్తా! యని తనప్రియ కురంగముపేరితో నెలుఁగెత్తి కేకలువేయుచుండెను.

ప్రాంతారణ్యమునం బరువెత్తుచుండగా నక్కడి వృక్ష శాఖలును, నికుంజలతలును దేహమునకుఁ దాఁకి గుచ్చుకొను నప్పుడు రాజది తన ప్రియకురంగము శృంగముల స్పర్శయని భావించుకొనుచు విచలితుఁడగుచుండెను. అడవిలేళ్లు దూరము నుండి పరుగెత్తుకొనిపోవుచుండఁగా వానిని జూచి విభ్రాంతుఁడై వాని నొక్కొక్కటిని తన దేవదత్తమనియే యెంచుకొని గొంతెత్తి "దేవదత్తా" యని బొబ్బలిడుచు వానివెంబడి నతివేగముతోఁ బఱచుచుండెను. అది తన దేవదత్తముగాదని తెలిసికొనినవెంటనే మొదలునఱికిన తరువువలెఁ దరుమూలమునఁ గూలంబడి పోవుచు మరలఁ బండుటాకులరాలినచప్పుడో, చెట్లకొమ్మలరాపిడిచప్పుడో వినఁబడినంతనే యవి తన దేవదత్తము నడలచప్పుడులని భ్రమించి వానిననుసరించి తిరిగి పరుగులిడుచుండెను.

రాజిఁక విహ్వలుఁడై పోయెను—ఓ దేవదత్తా! ఒక్క మాఱు నాకన్నులయెదుట నిలువుము. నీమెడక్రింద నాచేతుల తో గోఁకెదను! ఒక్కమాఱు నాదగ్గఱకు రమ్ము. నీడెక్కల చప్పుడు విని నాచెవుల పండువుచేసికొనెదను. ఈచేతులతో నీ కెప్పుడు లేఁబచ్చిక మేపెదను? నీమోముఁ జూచి నాకన్ను లెప్పుడు కృతార్థములగును? అని పలవించుచు దిరుగుచుండెను.

నిద్రాహారములను ద్యజించి రా జిప్పుడు రజ్జుసర్ప భ్రాంతితోఁ గనఁబడినదెల్ల దేవదత్తమె యని భ్రమించుచుఁ బరిభ్రమించుచుండెను. ఇప్పు డాతని దేహమంతయు వనకంటకములు గ్రుచ్చుకొనియు గీసికొనియు, రక్తబిందువులొలుకుచు ధూళిధూసరితమై యుండెను. కఠోరములైన కొండశిలల తాఁకుడులచేఁ బదతలములు విశీర్ణములై పోయెను. గుంటలు పడియున్న కన్నులయందలి ఆశుష్కతారకలు నిరాశాసూచకములై యుండెను. ఆఁకలిబాధచే నాతనికడుపు వీపునంటుకొని పోయెను. ఇంకను నాతని శుష్కకంఠమునుండి వికృతస్వరముతో "దేవదత్త" యను నస్ఫుటవాక్కు లుచ్చరింపఁబడుచునే యుండెను. అడవిపంది నొకమాఱు, వనమార్జాలము నింకొకమాఱు, మానుపిల్లిని మఱియొకమాఱు చూచి వానిని దన దేవదత్తమనియే భ్రాంతిఁజెందుచు నారమణీయ వజ్రిపర్వతశిఖరమున కెగఁబడి యాతఁ డింకను పోవుచునేయుండెను. ఉన్మత్తచిత్తముతో నాతఁడు ప్రస్తరఖండములను, వనలతలను నెత్తికొని కొండ యెక్కుచుండెను. అంతలో నాతఁడు తన గుప్పిళులతో వానిని జిదిమి విసరివైచి యాకొండక్రిందినేల కదాటున నుఱికి పడిపోయెను. కంటకములచేతను గొండశిలలచేతను, నాతనిదేహము క్షతవిక్షతమైపోయెను. కాని యాతని లక్ష్య మప్పు డావైపున లేదు. తిరిగి యాతఁడు గండకీనదీతీరమును బట్టి పోఁజొచ్చెను. కాని యిప్పు డాతఁడు దిక్ఫరి

జ్ఞానశూన్యునివలె నిది తూరుపు, నిది పడమర, ఇది దక్షిణము నిది యుత్తరము నను వివరణము యెంజేసిఁ బడి ... బోవుచుండెను. అయ్యో! ఇతఁడేనా, అనుపమ ... భరతుఁడు!—ఎవ్వఁ డగ్నిష్టోమనామకయజ్ఞ మొన... భువనప్రసిద్ధమైన శుద్ధకీర్తి నార్జించెనో, యెవ్వని యేకాగ్ర చిత్తముతోడి మహాతపస్సునకుఁ బులహుసంతతిఁ మహర్షియు విస్మితుఁడై పోయెనో, యెవ్వని దివ్యనామముచే నియ్యఖండ భూమండలము "భరతఖండ" మని పేరొందెనో, ఆతఁడేనా, యీతఁడు? అహా! మమకారమా! నీ వెంతవారి నెంతలో నింతవారిని జేయఁజాలవు?

ఆవృద్ధరాజు—ఆభరతర్షి నేఁటి కెనిమిదినములనుండి యుపవాసములతోను, జాగరణములతోను, ... తో శోకాకులుఁడై తిరిగితిరిగి యిప్పుడు పడిపోయెను. నిర్జన మైన యా వజ్రపర్వతోపత్యకయందు, ఆకొండశిలలపై మస్తకము వాల్చి యిఁక లేచుటకు శక్తిలేక యాతఁడు పడి యుండెను. ఎవ్వనిశిరము మానవదుర్లభమాణిక్యరాజీమండిత మకుటధారణ మొనరించెనో, సువర్ణనవరత్నఖచిత వివిధ విభూషణ విభూషితయు, నుజ్జ్వలదుకూలకౌశేయ పరివృత పరి శోభితయు నైన పట్టమహిషి పంచజని యంకభాగమునఁ గోమలవ్యజనసేవితుఁడై యెవ్వఁడు సుఖనిద్రఁ జెందుచుండెనో, త్రిపథ్మక్షానోజ్జ్వల శిఖాప్రఖరరశ్మ లెవ్వనియందు జాజ్వల్య

మానము లయ్యెనో, ఎవ్వనిశిరంబు పుణ్యచింతల కాకరంబును సమస్తజీవహితసంకల్పవ్యస్తమును, సుందరసుగంధకేశభారాలంకృతంబును నయ్యెనో అట్టివానిశిర మిప్పుడు ధూళిధూసరిత జటాబద్ధ కేశదాముమై, మరణాసన్నకాలమునఁ గఠినశిలావలుంఠితమై పడియుండెను. విధాతా! నీవిధాన మెవ్వ రెఱుంగఁ గలరు?——రాజప్పుడును హీనస్వరముతో "దేవదత్త" యని స్మరించుకొనుచునే యుండెను. ఆస్వరము క్రమముగాఁ గంఠగహ్వరమునుండి వెలువడఁజాలకుండెను. ఆతనికన్ను లిప్పుడు సన్నిహితమృత్యువుచే నూర్ధ్వగాములగుచున్నను దేవదత్తము నన్వేషించుచునే యుండెను. ఆనిశ్చేష్టదేహము దేవదత్తాగమనమార్గమున కున్ముఖమైయే పడియుండెను. ఆతఁడు గుఱి పెట్టి యెక్కుడిన బాణమువలె నేకాగ్రమును గావించిన తన చిత్తమును దేవదత్త చింతనాయిత్తము గావించియుండెను.

రాజున కిప్పు డనతిదూరమున నిల్వఁబడి దేవదత్తము కరుణార్ద్రనేత్రములతో నాతనివంకఁ జూచుచుండెను. అది యిదివఱ కనేకపర్యాయములు సామీప్యమునందు నిలిచి యే విధముగా నాతనిఁ జూచుచుండెడిదో, యావిధముగానే యిప్పుడును జూచుచుండెను. దాని రెండుకొమ్ములకును దెగిపోయిన తీగలు చుట్టుకొని వ్రేలాడుచుండెను. రదనాగ్రము లించుక కనఁబడునట్లుగా రెండుగడ్డిపరక లది నములుచుఁ గ్రిందిపెదవి యించుక కదల్చుచుండెను. దాని విచిత్రవక్షశ్శోభిత మైన

దేహమునందు సాంధ్యరాగకాంతు లొలసి విరాజిల్లుచుండెను. నిర్మలచిత్రమువలె నున్న యాదేవదత్తము—ఆతని దేవదత్తమే—ఆతని కన్నులయెదుట నిల్వఁబడి యుండెను.

రాజిప్పు డుచ్చైస్స్వరముతో "దేవదత్తా" అని యొక్క మాఱు పిలువఁబోయెను; కాని యీమాఱు మిక్కిలి కష్టముతో నస్పష్టముగా దేవదత్తనామ మాతనిచే నుచ్చరింపఁబడెను. ఇప్పు డాతనికన్ను లొక్కమాఱుగా మూసికొనిపోయి దేవదత్తమునే చూచుకొనుచుండెను. అతికష్టముపై నొక్క యశ్రుబిందు వాతనికనుగొలుకులనుండి చెక్కులపైఁబడియెను. తనకన్నులయెదుట నగపడుచున్న ఆహరిణరూపమునుజూచుచు నారాజర్షి తనప్రాణవాయువులను విడిచివేసెను. అయ్యో! ఆసన్నమృత్యుకాలమునం దాతఁడే దేవదత్తమును వీక్షించుచుండెనో యాదేవదత్తము—ఆకురంగము, ప్రకృతికురంగము గాదు! అది యాతని మనోనిర్మిత మైనకురంగము. కాని మరణసమయసంకల్పజనిత మైనయాహరిణము—నిజమైన తత హరిణ మనియే యాతఁ డెంచుకొనెను.

# జడభరతుండు.

## ఏడవ ప్రకరణము.

మహారాజైన భరతుఁ డిట్లు హరిణధ్యానపరాయణుఁ డగుచు దేహత్యాగము గావించెను. పిమ్మట నాతఁ డావజ్ర పర్వతమునందే "కాలంచరము"ను నొకశైలమునం దొక లేడిగర్భమున లేడియై జన్మించెను. కాని భగవత్కృపచే నాతనికిఁ బూర్వజన్మజ్ఞానము లభ్య మయ్యెను. అంత్యకాలము వఱకును, నాతఁ డెట్టిస్మరణము దానినిగూర్చి గల్గియుండెనో అట్టిదానివలెనే పుట్టుక తటించినదిగాదు.

పూర్వజ్ఞానోన్మేషముచే నాతనికిఁ దనపూర్వజన్మ వృత్తాంత మంతయు స్మరణకు వచ్చెను. శోచనీయ మైనప్రస్తుతావస్థను బొందుటకు హేతువును దెలిసికొని యాతఁడు మహాభయమునకు లోనుగాఁ జొచ్చెను. క్రమముగా భయవిహ్వలుఁ డై పోవుచుండెను. ఆవివశావస్థయం దాతనిహృదయాంతరమున దయామయుఁ డైనపరమేశ్వరుని పాదావలంబనము పొడసూపెను. వెంటనే యాతనిచిత్తభృంగ మాయమృతమయ పాదాబ్జమున వ్రాలి తద్ధ్యానసుధాపానముచేఁ జొక్కిపోయెను.

ఆశక్త్యసంహారుని, అఘవినాశకుని, ఆశాంతిదాయ

కుని, ఆజగన్నాయకునిసమక్షమున నాపవిత్ర్యక్షసుఖానుభవము నందాతని కన్నిభయములును దూరీభూతములై పోఁజొచ్చెను. అప్పుడింక నాతఁడు లేచి మృగజీవన మభ్యసించుటకు మొదలు పెట్టెను. కాని నడుమనడుమ గంభీరవిషాదముచే నాతని హృదయ మభిభూత మైపోవుచునే యుండెను.

పూర్వజన్మవిశేషపుణ్యబలము నూఁతకోలగాఁ గొని యాతఁడు——మృగరూపధారి యైనయామహాత్ముఁడు గండకీనదీ తీరమార్గములం దిరుగాడుచుండెను; పండిరాలినపత్రములను మాత్రమే మేయుచు నెట్లో జీవనమును గడపుచుండెను; వన్యము లైనక్రూరమృగములబారినుండి యాత్మరక్షణ మొనరించుకొనుట కాతఁడు ప్రయత్నించుట లేదు. నిత్యనిర్మల మైనయాగండకీనదియం దాపరిశుద్ధజలములఁ బానము సేయుట కెప్పు డాతఁ డడుగిడునో, అప్పు డాతనికన్నులనుండి యశ్రుధారలు నదిలోఁ బ్రవహించి పోవుచుండెను. ఈనదీజలముల యందు నిలిచి తర్పణపూర్వకముగా నాభగవాను నారాధించు నధికారము నాకీజన్మమున నింక లేదుగదా యని యాతఁడు వేదనపడుచుండును.

కొన్నిదినము లిట్లు గడచినపిమ్మట నాతఁ డొకనాఁడు పులస్త్యపులహాశ్రమము నందలిహరిక్షేత్ర మునుచోటికి వచ్చి యుండెను. మృగరూపధారి యైనభరతుఁడు గండకీనదీతీరము నం దివెవఱకు విడిచిపోయిన తనకుటీరమును గుర్తించి "ఓకా

నొకప్పు డీకుటీరమునందు, ఆ దర్భాసనముపై, జపమాలను ధరించి భగవచ్చింతన మొనరించుకొనుచు నుంటినిగదా” యని చింతించుచు నశ్రుపూరిత నేత్రములతో నాపవిత్రదేశ మంతయుఁ గలయఁ జూచి కలయఁ జూచి కుటీరద్వారమునందలి ధూళిలోఁ బడి దొర్లుటకు మొదలుపెట్టెను.

ఎట్టిబ్రహ్మానందము నాతఁ డొకప్పు డనుభవించి యుండెనో, యట్టియనుభవమున కాతని కీజన్మమునం దేక నధికారము లేదు. ఆతఁడు కాంచనమును విడిచివైచి గాజు పూసకై మమత్వముఁ జెందెను. మనుష్యుఁడై యుండియు మానవునకు సారధన మైనబ్రహ్మజ్ఞానము నాతఁడు స్వేచ్ఛగాఁ బచ్చపైకము లేకుండ వెచ్చపెట్టివేసెను. కావుననే యాతఁ డిప్పు డాపరమపదవినుండి వంచితుఁడై పోయెను. ఆతనికి హరిణరూపమున నవతరింపవలసివచ్చెను.

పులహార్షికుటీరపార్శ్వమునం దాహరిణరూపభరతచక్రవర్తి నిల్వఁబడి యాఋషిశిష్యులను, ఆప్రజ్వలితహోమానలమును జూచుచుండెను. అప్పు డాశిష్యగణము, ప్రణవమంత్రోచ్చారణచేఁ బ్రహ్మధ్యానమున నియుక్తులై యుండిరి. ఆమృగమది యాలించుచుఁ దక్కినసమస్తప్రపంచమును మఱచి రెప్పవాల్పనికన్నులతో మునికుమారులరూపసుధ నాస్వాదించుచు నట్లె నిల్వఁబడిపోయెను. దానిగండఫలకములనుండి బాష్పధారలు ప్రవహించుచుండెను. అప్పు డామృగరూపభరతుఁడు

పులహాక్షీశ్వరునిమాత్ర మవలోకించుటకు సాహసింపలేకపోయె ను. ఎవ్వఁడు పరమానుకంపతోఁ దన్ను మోహపంకము నుండి యుద్ధరించుటకుఁ బ్రయత్నించెనో—స్వర్గప్రాయ మైన యెవ్వనిసత్సంగతిని విడనాడి తాను మాయామోహపమునఁ బడి పోయెనో అట్టిపులహాక్షిభాస్కరు నాతఁడు కన్నులెత్తి చూడఁ జాలకపోయెను.

పులస్త్యునియాశ్రమమునం దొకమూల నామృగము పడియుండెను. అది యించుకైన మేఁత మేయుట లేదు. ఋషిశిష్యులు దయతో దానిముందర నేమైనఁ బడవేసినచో, నది యించించుక కొఱుకుచుఁ బ్రాణములు నిల్పుచుండెను. కర్మానుభవ మగునంతవఱకును దేహమునఁ బ్రాణములుండక తీఱదని యూహించుకొని, యది కేవలము ధైర్యము నూఁత కోలగాఁ గొని, ఆహారనిద్రాదిసకలసుఖములపై విరక్తిఁ జెంది శేషకాలమును నిరీక్షించుచుండెను.

ఒకనాఁడు గాలవుఁడు, దూర్వాంకురములను గుప్పిలితోఁ దెచ్చి దానికిఁ దినిపింపఁబోయెను. కాని యాతఁడు తనపవిత్ర కరస్పర్శచే దాని నెంతయో లాలించినఁగాని యది యాఖాద్య మును మేసినదిగాదు. అప్పుడు దానిరెండుచెక్కులనుండియు దుఃఖాశ్రువులు ప్రవహించుచునే యుండెను. అప్పుడు గాలవుఁ డక్కడఁ గూరుచుండి యుచ్చైస్స్వరముతో నీక్రింద వ్రాయఁ బడినశ్లోకములను బాఠము చేయుచుండెను.

శ్లో. "సర్వేక్షయాంతానిచయాః, పతనాంతాః సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాంతా, మరణాంతంచ జీవితమ్.
యథా ఫలానాం పక్వానాం, నాన్యత్ర పతనాద్భయమ్
ఏవం నరస్య జాతస్య, నాన్యత్ర మరణాద్భయమ్.
యథాగారం దృఢస్థూణం, జీర్ణం భూత్వావసీదతి
తథావసీదంతినరా, జరామృత్యు వశంగతాః.
అత్యేతి రజనీ యా తు, సా న ప్రతినివర్తతే
యాత్యేవ యమునాపూర్ణం, సముద్రముదకార్ణవమ్.
అహోరాత్రాణి గచ్ఛంతి, సర్వేషాం ప్రాణినామిహ
ఆయూంషి క్షపయంత్యాశు, గ్రీష్మే జలమివాంశవః.
ఆత్మాన మనుశోచత్వం, కిమన్యమనుశోచసి,
ఆయుస్తు హీయతేయస్య, స్థితస్యాథగతస్యచ.
యథా కాష్ఠంచ కాష్ఠంచ, సమేయాతాం మహార్ణవే
సమేత్యతు వ్యపేయాతాం, కాలమాసాద్యకంచన.
ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ, జ్ఞాతయశ్చ వసూనిచ
సమేత్య వ్యవధావన్తి, ధ్రువోహ్యేషాం వినాభవః.

భరద్వాజుఁ డీశ్లోకపాఠములను వినుచుండెను; స్థిర దృష్టితో భావవిహ్వలుఁ డై నశోత్రవణై స్పృగముగాడ నా స్థలమునందే నిల్వఁబడి యుండెను. దానికన్నులకు రెప్పపాటు లేదు; అత్యంతశ్రద్ధతో నాశ్లోకపఠనము నాలించుచుండెను. గాలవుఁడు భరద్వాజుని జూచి "తఃస్ప్రయుఁడు జూచుఁగా

జాల వింతమృగమువలె నగపడుచున్నది. ఇది నామాటలన్నియు నతిశ్రద్ధతో నాలకించుచున్నది. వానియర్థము దానికి బోధపడుచున్నట్లు తోఁచుచున్నది సుమా?" అని పలికెను.

భరద్వాజుఁడు వానినిఁ జూచి "సరిసరి, నీవీలేడిని జాల శ్రద్ధాభక్తులతోఁ జూచుచున్నట్లగపడుచున్నావే? నీవు గూడ భరతరాజువలె లేడిమాయను లోఁబడిపోయెదవా యేమి?" అనియెను.

గాలవుఁడు నవ్వుచు "ప్రవృత్తితో నాటలాడ సాహసించుటకు నేనొకక్షత్రియరాజును గాను" అని సమాధానము చెప్పెను.

వీరిసంభాషణమును వినుచు నిలుచున్న మృగరూపధారియైనభరతుఁడు, దారుణానుతాపముచే దగ్ధుఁడై పోవుచుండెను.

పులహర్షి యది యంతయు వినుచుండెను. ఆతఁడు మృగమువంకఁ జూచుచు దానియథార్థచరిత్ర మంతయు గ్రహించెను. మృగమును బులహునికోమలస్నిగ్ధనేత్రములలోనియింగితము నెఱుంగఁగలిగెను. పరమకారుణికుండైన ఋషిపుంగవుఁడు తనకొఱ కంతరంగమునఁ జింతించుచున్నాఁడని యది తెలిసికొనియెను. ఆదుఃఖము దయాజనితమయినది; దానిలో జ్వాలలు లేవు; అది హృదయమును బవిత్రపఱుచు గాని, మాయకు వశీభూతము గానీయదు, అనియు న

గ్రహించెను. మృగ మప్పుడు కృతజ్ఞతావేగముచే ఋషీశ్వరుని పాదప్రదేశమునందుఁ దనకొమ్ములను ఫాలదేశమును మోపి బోరగిలఁబడి యట్లు కొంతసే పుండి తనచిత్తమునకు శాంతి సంపాదించుకొనియెను. దాని కిప్పుడు బ్రహ్మజ్ఞానసంపాదనమున కధికారము లోపించిపోయినమాట నిజమే, కాని భగవంతుఁడు దాని నిప్పుడును, సాధుసంగతివలనియధికారమునుండిమాత్రము వంచితముఁ నుగావింపలేదు. ఇదియే దాని కిప్పు డూఱట గల్గించు నుత్కృష్టపదమై యున్నది.

ఎక్కడ హోమాగ్నులు ప్రజ్వరిల్లుచుండునో, అక్కడనే స్థిరభావముతో నామృగము నిలుచుండి యుండును, హారతి కాలమునం దెచ్చోట ఋషివరులు మంత్రపాఠములను గావించుచుందురో, అచ్చోటనే యది చిత్రపటములోనిబొమ్మ వలె నిశ్చలమై నిలిచి వినుచుండును. క్రమక్రమముగా నది తృణాములను నోటఁ బెట్టుట మానివేసినది. దానిదేహ మంత కంతకుఁ గృశీభూతమై పోవుచుండెను. ఋషికుమారులు లేఁ బచ్చికను దెచ్చి నోట కందించునప్పుడు దానిరెండుకన్నుల నుండియుఁ గన్నీటిధారలు ప్రవహించి పోవుచుండెను. అది యొకేవిధముగా నాహారత్యాగము చేసివేసినది. భగవంతుని నోరారఁ బిలువవలయునని, యది యంతరాత్మలో నత్యంతము వ్యాకులపడుచుండెను. కాని యాపశుశరీరబంధనము నతిక్రమించి పరమార్థసాధన మొనరించుటకు దానికి సమర్థత యెక్కడిది?

మృగరూపధారియై యుపవాసములచే శుష్కశరీరుఁడై యున్న యమ్మహాత్ముఁ డొకనాఁడు గండకీనదీతీరమున నిల్వఁబడి యుండెను. ఆసమయమున [illegible] యాకస్మికముగా నాతనిదుఃఖిత హృదయమునఁ బరజన్మమును గూర్చిన విచార మంకురించెను; అప్పు డెవ్వరో వెనుకనుండి స్నేహశీతలమైన కోమలకరములతో నామృగరూపధారిశరీరమును స్పృశించిరి! మృగ మాస్పర్శ సుఖముచే వికంపితమై యానందబాష్పములు గురియింపఁ జొచ్చెను. అట్టిమరణావస్థలో దానికా స్వర్గప్రాయమైన సుఖస్పర్శ మొసంగినవా రెవ్వరు? కారుణికోత్తముఁ డైన సప్తర్షి సత్తముఁడు—ఆశీర్వాదపూర్వకముగాఁ దనకరాంగుళులతో నాతఁడు దానిశరీరమును నిమిరెను. మృగ మప్పు డత్యంత కృతజ్ఞతకు వశమై యశ్రుపూరితనేత్రములతో నాతని ముఖమండలమును రెప్పవాల్పక చూచుచు నాతనిపదప్రాంతమున నందలిభూమిపైఁ బడిపోయెను. ఆశుభప్రదోషకాలమున నా గండకీనదీతీరమున మృగరూపధారియైన భరతచక్రవర్తి హరిణ దేహమును బరిత్యజించెను.



# జడభరతుఁడు.

## ఎనిమిదవ ప్రకరణము.

ఎన్నియో జన్మము లెత్తవలెను; ఎంతయో కాలముగడవవలెను! అప్పుడు మనుష్యజన్మము! మనుష్యజన్మ మనఁగా నేమి?—పంజరాబద్ధమైనపక్షికి బంధవిమోచనము—క్షుద్ర సరోవరము లతిక్రమించి మహాసముద్రములోఁ బ్రవేశించుట—తుచ్ఛములగు దేహసుఖఘట్టములను దాఁటి, యాధ్యాత్మికానంద మనుభవించుసామర్థ్యము నొందుట—అది ప్రణవోచ్చారణాధికారప్రాప్తికి శుభకాలము. అనంతమైనవిమానమువలె—నపారమైనసముద్రమువలె బ్రహ్మానంద మనునప్రమేయక్షేత్రము మనుజుని సమ్ముఖమునందుఁ బడియున్నది. రాజాధిరాజున కుత్తరాధికారికాఁగలవాఁడొకసామాన్యకుటీరమునం దుండి తనజన్మస్వత్వమును విడిచికొనుచున్నట్లు—ఎవ్వరు తుచ్ఛమైనసుఖదుఃఖములకు లోనగుచున్నారో వారు తమజన్మగౌరవమును దెలిసికొనకున్నారు.

ఆత్మబంధమునుండి విముక్తుఁడై యపరిమితానందలాభము నందుటకు మహారాజైనభరతున కిప్పుడు సమయము వచ్చినది.

ఇక్షుమతీనదీతీరమునందు, శివాలయ మనునొకగ్రామము గలదు. ఆగ్రామమునం దింద్రచూడుఁ డను బ్రాహ్మణుఁ డుండెను. ఈతఁడు అంగీరసఋషివంశములోనివాఁడు. ఈతని కే మనభరతుఁ డిప్పుడు పుత్త్రుఁడై జన్మించెను.

ఇప్పుడు సాధుసంగమమువలనిఫలము ఫలింపఁగలదు. దీర్ఘమైనమృగజన్మమునకుఁ దరువాత మనుష్యజన్మలాభము నొంది రాజర్షి యిప్పుడు బ్రహ్మజ్ఞానప్రాప్తిని బడయఁగల్గెను. ప్రకృతిసౌందర్య మనుభవించుట కుపయోగ మగుదృష్టిశక్తి బడయఁగల్గినచో వికసితకుసుమముల నమలివేయుట కెట్టిపశువైన నాశ చెందదు. అప్పు డీప్రకృతి యట్టిజీవి కానందసాధకముగా నుండఁగలదు. మహారాజైనభరతున కీజన్మమునం దట్టిబ్రహ్మానందము ప్రాప్తించెను. మఱియు నట్టిబ్రహ్మానందముతో నాతఁడు జ్ఞాననేత్రలాభమునుగూడఁ బడయఁగల్గెను. జ్ఞానప్రాప్తివలన నాతనియందు సమస్తమైనభోగవాంఛలు నొక్కమాఱుగాఁ దిరోహితములై పోయెను. ఈజగత్తుయొక్క యథార్థరూప మీమాఱు నాతనికన్నులకుఁ బ్రత్యక్షమయ్యెను. కాని, మున్నొకమాఱు అట్టిదుర్లభజ్ఞానలాభము నొందియు నాతఁడు దానిని గోలుపోయియుండెను. ఈమాఱుగూడ నట్టే యైనచో భగవన్మాయను దప్పించుకొనుట యింకెవ్వరికి సాధ్యమగును? దయామయుఁ డగుపరమేశ్వరునిదయకంటె నీమాయాసముద్రము నుత్తరించుట కన్యావలంబనము లేదుగదా—

భరతుఁ "ఓ రాజ్యజగమునం దెవ్వరితోఁడను బ్రత్యేకసంబంధము గల్పించుకొని విపన్నముద్రములోఁ బడఁగూడ" దని స్థిరసంకల్పము చేసికొనియెను.

ఇంద్రచూడున కిద్దఱు భార్యలు. ప్రథమభార్యగర్భమునం దెనమండ్రుపుత్త్రులును, ద్వితీయభార్యగర్భమునం దొకపుత్త్రుఁడును బుత్త్రికయు జన్మించిరి. రాజర్షి యైనభరతుఁడే ద్వితీయభార్యగర్భమున నుదయించినపుత్త్రుఁడు. విధాత్ర విధానముచే నీజన్మమునందుఁగూడ నీతనికి భరతుఁడనునామమే ప్రాప్తించినది. ఇంద్రచూడుఁ డత్యంతనిష్ఠాగరిష్ఠుఁడును, శుద్ధచరిత్రబ్రాహ్మణుఁడు నై యుండెను. ఆతఁడు పరమభాగవతోత్తముఁ డనియు, సకలశాస్త్రవేత్త యనియు నెల్లరిచే సన్మానితుఁ డగుచుండెను. ఆతనిద్వితీయభార్య యైనకమలాదేవియు రమణీకులరత్న మని పేరెన్నికఁ గాంచుచుండెను. ఇంద్రచూడుఁ డత్యంతబాగరూకతతోఁ దనబిడ్డలందఱకు శాస్త్రవిద్యాభ్యాసము నొసఁగుచుండెను. ఆతనిపెద్దభార్య సంతాన మైనయెనమండ్రుపుత్త్రులును శాస్త్రపరిశీలనానకు లై గొప్పపండితులైరి. భరతుఁడు కనిష్ఠపుత్త్రుఁడు— ఈబాలకుని యాకారము సకలజనానందకర మైనదిగా నుండెను. ఎవ్వని హృదయమునందు సర్వదా భగవద్జ్ఞానము విరాజమానమగుచుండునో, వానిఁజూచి లోకజను లెల్లరు ముగ్ధులుకారా? అందుల కాశ్చర్యమా? దర్శనమాత్రముననే హృదయములను

గలుగించి వశపఱచుకొనఁగలస్నిగ్ధాకర్షణము సహజముగా వాతనియం దుండుటఁ జూచి బ్రాహ్మణునియాత్మీయులందఱును "ఇంద్రచూడా! నీయీచిన్నికుమారుఁడు పరమభాగవతోత్తముఁడు కాఁగలఁడుసుమా?" యని యనుచుండెడివారు.

కాని, యీబాలుఁడు పెద్దవాఁ డగుచున్నకొలఁదిని, ఇంద్రచూడునియాశ లన్నియుఁ దిరోహితములై పోఁజొచ్చెను. పిల్లవాని కిప్పు డేడేండ్లు వచ్చినవి. ఒక్కమాటనైనను మాటాడనేరఁడు. ఎవ్వరైనఁ బిలిచినప్పుడుమాత్రము తనస్నిగ్ధనేత్రములు పరినారికములు గావించి, యుదాసీనునివలె వారి వంకఁ జూచుచు నూరకుండును; తోడిపిల్లలతో నాడుకొనఁడు; దేనియందు నుత్సాహము గాని, యామోదము గాని చూపఁడు; ఎక్కడకైన నెవ్వరైన వెంటఁ బెట్టుకొని పోయినచో, అక్కడకు వారితోఁ బోయి స్థాణువువలె నూరకుండును. ఇంద్రచూడుఁడు తనకుఁ బ్రాణప్రియుఁడైనయీకనిష్ఠపుత్త్రుని శిక్షకొఱ కనేకవిధములఁ బ్రయత్నము లొనరించుచుండెను. ఒకదానివల్లనైన నొక్కింతయైన లాభముగలుగకుండెను. చెప్ప శక్యముగానిసౌందర్యము—సముజ్జ్వలమైనలలాటము, ఆకర్ణదీర్ఘము లైననేత్రములు—యథాంగసౌష్ఠవమైనదేహము; అయిన నేమి? ఆబిడ్డ మూఁగవాఁడు! ఈకష్ట మాతల్లిదండ్రుల కెంతటి దుస్సహమైనది? ఇంద్రచూడుఁ డాతని కుపనయనము గావించి, సావిత్రీమంత్రదీక్షితునిగాఁ జేయుట కెంత

దో ప్రయత్న మొనరించెను. కాని బాలుఁ డొక్కింతయు మంత్రోచ్చారణ మొనరింపఁజాలకుండెను. ఎంతో తియ్యని స్వరముతోఁ జెప్పియు నెంతో ఆదరముఁ జూపియు నెన్ని విధముల నాతని కుచ్చరించుమార్గములు బోధించియుఁ గుమారునిచే మంత్రపఠనము చేయించుట కాతఁడు కష్టపడియెను. అతనికష్ట మంతయు వ్యర్థమయ్యెను—ఇఁక నాతనికిఁ గోపము గల్గినది. ఒక్కమాఱు కుమారునికిఁ బ్రహారములు గావించెను. కాని యేమిఫలము? కలువపువ్వులవలె రెండుకన్నులను విప్పి జాలిచూపులు చూచుచు భరతుఁ డెప్పటియట్లె నిల్వఁబడి యుండెను. అతనిమోమునం దొకవ్యక్తమైన నొకనవ్వుగాని, కన్నులయం దెవ్యక్తమైన నొకయశ్రుబిందువుగాని యెవ్వరును జూచియుండలేదు—నిర్వికారుఁడు, జడస్వరూపుఁడు, సకల స్నేహబంధనములకు నతీతుఁడు నైనయీబాలకునియందు, అజడస్వభావములో నేదియో యొకవింతసౌందర్యము కలదు. అందుచేతనే యాతనిని ప్రేమింపకుండ నుండలేకున్నాను.

ఇంద్రచూడుఁ డొకనాఁడు కుమారునిశరీరమును జేతితో నిమురుచుఁ దనహృదయానుతాపమును జూప మొదలు పెట్టెను. అప్పు డాతండ్రినేత్రములనుండి జలజలమని యశ్రుబిందువులు రాలుచుండెను; మూఁగబాలుఁడు సస్నేహముగాఁ జేయెత్తి యప్పుడు తండ్రికన్నీటిధారలను దుడువఁజొచ్చెను. మఱియు నాతఁడు కేవలము కనుచూపులమూలముననే తండ్రి

హృదయమునందుఁ బరమశాంతిభావమును నెలకొనఁజేసెను.

ఇంద్రచూడుని కనిష్ఠకుమారుఁడు శ్రీకంఠుఁడు—“ఈ మూఁగకుఱ్ఱవానితోఁ దండ్రి రాత్రిందివములు నిష్కారణముగాఁ గడపివేయుచున్నాఁడు. భగవంతుఁ డీతనికి వాక్ఛక్తి నీయలేదు. వీఁడిట్లు మూఁగవాఁడుగా నున్నను దండ్రి వీనికి మాటలు నేర్పుటకుఁ బ్రయత్నించును. దైవవిధానమునకుఁ బ్రతివిధానము చేయఁ జూచుచున్నాఁడు” అని తఱచుగాఁ జెప్పుచుండును. జ్యేష్ఠకుమారుఁడైన ముక్తికాముఁ డామాటలు విని నొచ్చుకొనుచుండును. ఆతఁడు “నేను చెప్పఁజాలను గాని యే కారణముచేతనో యీమూఁగబిడ్డనియెడల నాహృదయము నందు మిక్కిలి స్నేహరస మూరుచుండును. రేయుంబవ లీతని విడువకుండవలయు నని యే నిచ్ఛగించుచుందును. భగవంతుఁ డిట్టిసుందరమూర్తి యైనబాలకుని మూఁగఁగా సృష్టించి యున్నాఁడు. వానివిధాన మెవ్వ రెఱుంగఁగలరు?” అని చెప్పుచుండును.

శ్రీకంఠుఁడు అన్నను జూచి—“నీవు కేవల మీతని మోముఁ జూచి మోసపోవుచున్నావు. ఈతఁ డతికుత్సితచరిత్రుఁడు. తల్లిదండ్రులగారాబముచే వీఁడిట్లు నిష్కారణముగాఁ జెడిపోవుచున్నాఁడు. ఇది శుచి, ఇది యశుచి యనుజ్ఞానము లేదు. ఎక్కడఁ బడిన నక్కడనే పడి యుండును. ఎనిమిది వత్సరములపిల్లవాఁ డైనాఁడు. ఇన్నియేండ్లును శౌచాదికృ

మందే కడపినాఁడు. ఈగాడిదె మొదలిధూళినైనను దులుపుకొనఁడు. నామతమునకుఁ జూడఁగా నిదియంతయు వాఁడు తెలిసియే చేయుచున్నట్లున్నాఁడు. గారాబముచేయువారెవ్వరును లేక నిత్యము బెత్తపుదెబ్బలు తగులుచుండినచో గుజ్జువానికి బుద్ధి రాఁగలదు” అని చెప్పెను.

ముక్తికాముఁడు—“ రామ రామా! అట్లనకుము! నిరపరాధినైనచిన్నను బాధించుటకూడ నెందులకు?” అని పలికెను.



# జడభరతుండు.

## తొమ్మిదవ ప్రకరణము.

ఇంద్రచూడుండు తనమూఁగకుమారునకు శిక్ష నొసఁగు విషయములో బొత్తుగా నాశ విడిచియుండలేదు. అతఁ డా విషయమునఁ గ్రమముగా నేకయో పని చేయుచునేయుండెను. ఆనోరులేనివానిచే మాట లాడించుట కాతఁడు దివారాత్రములు కష్టపడుచునే యుండెను. అతఁ డట్లు కష్టపడుచున్న కాలములోనే యొకనాఁడు, జీవుల కపరిహార్య మైనకడపటియాహ్వాన మాతనికి వచ్చెను. అతఁ డప్పుడు దేహమును విడిచి స్వర్గధామమునకుఁ బ్రయాణము చేసెను. ఆతనిరెండవభార్య యైన కమలాదేవి వెంటనే తనపుత్రపుత్రికల నిద్దరను దనసవతి హస్తములలో నర్పించి తనప్రాణేశ్వరునిచితిపై నారోహణ మొనరించెను.

కమలాదేవి చితాగ్నిలో దగ్ధము గాఁగానే, మాతృకైన అరుంధతియు, సవతియైనలక్ష్మీదేవియు, నామెయెనమండ్రు పుత్త్రిలును రోదనధ్వనులచే గగనమండలమును విదీర్ణము గావింపఁజొచ్చిరి. భరతునిఁగూడ నీస్థలమునకుఁ దెచ్చియుం... పదియేఁడులయీడుగలభరతుఁ డాయార్తనాదములమధ్యమున నిర్వికారుఁడై నిల్వఁబడి యుండెను! అతనిమూర్తిమాత్రము గంభీరతరమై యుండెను. సముద్రమధ్యమునం బడిపోయిన

మనుష్యునకును, సముద్రతీరమునం దుపవిష్టుఁడై నిశ్చింతుఁడుగా నున్నవానికి నెట్టిపరిభేద ముండునో, వీనికిని దక్కినవారికి నట్టియంతరువు కన్పట్టుచుండెను. బ్రహ్మజ్ఞానపరిపూర్ణతయు, ననిత్యవస్తుధ్వంసమునకు వికారము చెందకుండుటయు నను నీ రెండుభావములు నాతనిముఖమండలమునందు సుస్పష్టముగా జాగరితములగుచుండెను. కాని వానిభ్రాతృగణ మీభావములను గ్రహింపఁజాలకుండెను. వారు వృథాపండితమన్యులై యుండిరి. శ్రీకంఠుఁడు దుఃఖమధ్యమునందుఁ గూడ "ఈమూఁగకుఱ్ఱవానిస్వభావముఁ జూచుటకుఁ జాల కష్టమగుచున్నది. పశువునకున్నంతజ్ఞానమైనను వీనికి లేదాయె" నని గొణుగుకొనుచుండెను.

కమలాదేవి చితి నారోహించుటకుముందు, ఒకచేత కుంకుమభరణియు నొకచేత భరతునిచేయియుఁ బట్టుకొని తన సవతియైన లక్ష్మీదేవిదగ్గఱకు వచ్చి తనభరతునిచేయి యామె చేతియం దుంచి యిట్లు చెప్పెను. "అక్కా! ఈబిడ్డను జూడుము! మీరెవ్వరు నీతని నెఱుఁగరు. నేనీతనిగూర్చి చెప్పఁజాలను. ఈబిడ్డను జూచుకొనుచు నేను నాజీవితమునందలి సకలకష్టములను మఱచిపోవుచుంటిని. ప్రాపంచికసంబంధములైన యెట్టిచింతలలోఁగాని యెట్టిశోకదుఃఖములలోఁగాని నేనున్నప్పుడు వీఁడు నాకొంగుపట్టుకొని నిలిచెనేని వెంటనే నాకు సుఖదుఃఖములయందు వైరాగ్య ముదయించుచుండును.

ఒక్కమాఱుగా నానందభావము హృదయమునఁ బ్రవేశించు చుండును. అది పుత్త్రస్నేహమువలనఁ గల్గినది గాదుసుమా. వీనిని నేనెప్పుడును బుత్త్రుఁడని తలఁచుట లేదు. నాకిప్పుడు గూడ నీనిర్వికారమూర్తిని జూచుచుండుటచే భౌతికసుఖదుఃఖములు లతితుచ్ఛము లని బోధ యగుచున్నది. నీవు నన్ననుగ్రహించి నాచితిసామీప్యమునం దీతని బట్టుకొని యుండుము. చితాగ్ని నిర్వాపిత మగునందాఁక నీతని నిచ్చటనే యుండ నిండు. నాయంత్యకాలమువఱకు నే నీతనిని వీక్షించుకొను చుండెదను. ఇఁక నొక్కప్రార్థన గలదు. అక్కా! నీవీతల్లి లేని మూఁగబిడ్డని కాఁకలివేళఁ బట్టెఁడన్నముఁ బెట్టుచుండుము. ఆఁకలివేళ వీఁ డన్న మడుగఁడు—అమ్మా! వీనికడుపాఁకలి నెఱింగి నీవే వీని కన్నమిడవలెను. అరుంధతికొఱకు నాకాలోచన లేదు. మనతక్కినపుత్త్రి లెనమండ్రును బ్రాజ్ఞత గల్గి పెద్దవా రైనారు. అక్కా! మీరందఱును గలసి నామూఁగభరతుని రక్షింపుఁడు" అనియెను. ఈమాటలను వినినలక్ష్మీదేవికన్నుల నుండి దుఃఖాశ్రుధార లొలుకఁజొచ్చెను. ఆమె వెంటనే తన రెండుచేతులతో భరతుని దరిచేర్చుకొని కౌఁగిలించుకొనియెను. వానిమస్తకమునం దశ్రువర్షము గురియింపఁజొచ్చెను.

తల్లిదండ్రులిద్దఱు నేకచితియందే దగ్ధులైపోయిరి. హాహాకారములతో ధరించుచుఁ బుత్త్రులును బుత్త్రికయుఁదల్లి యైనలక్ష్మీదేవియు దుఃఖనిమగ్నులై గృహమువంకకు మరలిరి.

---

# జడభరతుఁడు.

## పదియవ ప్రకరణము.

తండ్రివలెనే ముక్తికాముఁడు మూఁగభరతుని గన్నులలోఁ బెట్టుకొని పెంచుచుండెను. తల్లియైనలక్ష్మీదేవియు మూఁగబిడ్డకు ముందుగా భుజింపఁబెట్టి తక్కినబిడ్డలఁ దరువాత జూచుకొనుచుండెను. మూఁగబాలుఁ డాగృహమునం దందఱకుఁ గనుపాపవలె నుండెను. మృతులైనతల్లిదండ్రులను స్మరించుకొనుచు వారియెడలఁ దమకుఁ గలకృతజ్ఞత నంతను స్నేహరూపకముగా భరతునియం దారోపించుకొనుచు నాగృహమునం దందఱు భరతుఁడు తమకుఁ బ్రాణప్రతిమ యనియెంచుకొనుచుండిరి. కాని యీస్నేహబంధనములచే నాతఁడు మాత్రము బంధితుఁడు గాలేదు. ఆకుపైఁ బడునుదకబిందువుల వలె, నాతనికొఱ కల్పితములగు నాప్రేమహృదయములస్థాయి భావము లించుకయు నాతనియం దంకితము లగుట లేదు. నడుమనడుమ శ్రీకంఠుఁడు మాత్రము భరతునకు దండనతాడనాదుల నొసఁగుచునే యుండెను. అందులకుఁ దక్కినసోదరులందఱు నాతనిఁ దగురీతి మందలించుచునే యుండిరి. అట్టి సమయములందు లక్ష్మీదేవి యాతని నత్యంతము దూఱుచుండు

టయే కాక కోపముచే నాతనితో మాటలాడుటగూడ మాను చుండెను. ఈవిధముగా నొకసంవత్సరము గడచెను. లక్ష్మీదేవి కూడఁ దనభర్తను సవతిని గలసికొనుటకు వెడలిపోయెను. అరుంధతి కింతకుఁబూర్వమే వివాహమగుటచే నామె యత్తింటికి వెడలిపోయెను.

పిమ్మట నన్నదమ్ము లెనమండ్రును గ్రామపురములలో వేఱుచేసికొని యజనయాజనాదులమూలమునఁ గాలక్షేపము గావించుకొనఁజొచ్చిరి. వార లీవ్యవస్థలో మూఁగవాఁ డున కొకొక్కరొకొక్కనాఁడు భోజన మిడుట కేర్పాటు చేసికొనిరి. భరతునియెడల నిప్పు డెవ్వరికి నంతగా శ్రద్ధలేకుండెను. అతఁడు మార్గమధ్యములయం దెక్కడనో యొక్కెడఁ బడియుండుచుండెను. ఘోరవర్షములును బ్రచండాతపములు నాతనిపై గురియుచుండెను. కాని వానివలనికష్టములు మాత్రము వాని కించుకయు స్ఫురింపలేదు. అతఁడు మార్గమధ్యమునం దెవ్వరు తన్నుఁ బిలిచినను వారివెనువెంటనే పోవుచుండును. యోగసాధనవలనను, బాహ్యేంద్రియనిగ్రహమునను, అతనిదేహము బలిష్ఠమై యుండెను. అతఁ డేనుఁగుగున్నవలె నేబురదలోఁ బడిన నాబురదలోనే దొరలుచుఁ బడియుండును. ఎవ్వరైనను సరియే, యెప్పుడైనను సరియే, యెంతటిబరువైనను సరియే, తన్ను మోయుటకు నియోగించినచో నాతఁడు నిరసనుఁడై యాబరువును దలపైఁ బెట్టు

కొని దానిని వారియుండ్లకడకుఁ జేర్చుచుండును. అందులకు బ్రతీకారముగా నెవ్వరైన నేకించిన్నైన నాతనికిఁ బెట్టినచో నచ్చటనే దాని నాతఁడు భుజించివేయుచుండును. ఏకొంచెమును బెట్టకయే యెవ్వరెట్టికార్యమును జేయుమనినను వారివారిపను లాతఁడు చేయుచుండును. మరికొందఱు తమకార్యముల నిమిత్త మాతని నెంతయోమారము తీసికొని పోయి పనియైన తరువాత నాతని గొట్టి తిట్టి పొమ్మనినను ఆతఁ డాస్థానము నుండి యెప్పటియట్ల నిశ్చింతతో వెడలిపోవుచుండును. ఎవ్వరేమి చెప్పినను భరతుఁ డది యంతయు భగవదాదేశ మని హృదయమున నిశ్చయించుకొని శిరసావహించుచుండెను. ఈ జగత్తునందు బ్రహ్మకు భిన్నమైన దన్య మేదియు లేదనియాతఁడు తెలిసికొనుటయే యిందులకుఁ గారణము. ఒకదినమునం దొక ముసలిగృహస్థురాలు తనయింటికి దాసి రాకుండుటచే భరతుని దనయింటికిఁ దోడ్కొనిపోయెను. దినమంతయు భరతుఁడు వారియింటఁ గసవూడ్చి కలయంపులు జల్లి యంటుగిన్నెలు దోమి సకలకార్యములు చక్కఁబెట్టెను. సాయంకాలమునం దాముసలియామె భరతునకు నెలవొసఁగెను. క్షుత్పిపాసాజ్ఞానశూన్యుఁడైన మూఁగతమ్మునికొఱకు ముక్తికాముఁ డూరంతయు వెదకి వెదకి నదీతీరమునం దాతని బట్టుకొని యస్వడింటికిఁ దీసికొనిపోయెను. ఆతనియాకృతిని గాంచినతోడనే యాతఁడు నేఁడించుకయు భుజింపలేదని సులభముగఁ దెలిసి

పోవుచుండెను. అయినను అతని మానసమండలము సదానంద మయమై యుండెను. ఎక్కడెక్కడకుఁ గొంపోయి యెవ్వ రెన్నిన్ని విధములఁ బరీక్షించినను భరతునినోట నొక్కసమా ధానమును వెడలదయ్యెను. ముక్తికాముఁ డాతనిదుర్దశకు మిక్కిలి దుఃఖతాత్ముఁ డయ్యెను. తక్కినసోదరులు నాతని దురవస్థకు దురపిల్లిరి. కాని వారేమి చేయఁగలరు? యజన యాజనాదికములు చూచుకొనుటకై వారు సర్వదా తిరుగాడు చుండవలయును. అదిగాక బాల్యావస్థయందున్నవారినెవ్వ రైనను బెంచి పెద్దచేయఁగలరు గాని పెరిఁగి పెద్దయైనతరువాత సదా యెవ్వరు కన్నులలోఁ బెట్టుకొని యుండఁగలరు?

క్రమముగా నాతనియన్నల కాతనియెడల నొకయుదా సీనభావ ముదయింపఁజొచ్చెను. కొంతకాల మాతనిని సం రక్షించుట వారికి సుకరముగానే యుండెను. కాని యిప్పుడు భరతుఁ డెక్కడకో పోవుచు నింటికి భోజనమునకు రాకుండినను వా రాందోళనమొందుట మానిరి. భరతుఁ డెవ్వరియిండ్లకో కట్టెలు మోయుచుండును. ఎవ్వరికో మట్టిమోయుచుండును. ఎవ్వరికో యేమేమో పనులు చేయుచుండును. అతఁ డిట్లు దినమంతయుఁ బరిశ్రమ చేయుచు నెవ్వరేని పయించుక యేమి పెట్టిన భుజించుచుండును. లేకున్న నుపవసించుచుండును. కొన్ని దినములు వృక్షమూలములందుఁ గొన్నినాళ్లన్నలయిండ్ల లోను గొన్నినాళ్లెవ్వరిని యోగముచేతనో కొన్నిగృహములకు

పహారాయిచ్చుటయందును నాతఁడు రాత్రులుగడపుచుండెను. ప్రతివ్యక్తియాజ్ఞయు భగవదాజ్ఞగా నాతఁడు విశ్వసించి ప్రతి పాలించుచుండెను. ఇట్టి యసామాన్య పరిశ్రమముచేతను, మానవసేవావృత్తివలనను, విశ్వాసమూలమునను బ్రహ్మజ్ఞాన మాతనిచిత్తమునం దుజ్జ్వలిత మగుచుండెను. కేవలసంతుష్టాంత రంగముతోడనే యాతఁ డన్నిపనులుఁ జేయుచుండెను.



# జడభరతుని చరిత్రము.

## పదునొకండవ ప్రకరణము.



ఒకనాఁడు శ్రీకంఠుఁడు తనసోదరులతో "మనమూర్ఖుఁడగు వాఁడు రేయుంబవళ్లు లోకు లందఱుపనులును విధాయకము లని చేయుచున్నాఁడు. అందుచే నేనిప్పుడు వానిని నాపొలములోఁ బెట్టుకొనిన బాగుగ నుండు నని యెంచుచున్నాను." అని వచించెను. ఆతనిసోదరు లందఱు నాతనిమాట కామోదించిరి; వెంటనే భరతుఁడు శ్రీకంఠునిపొలమునందు చేలకాల్వలకు నీరు కట్టుటయందు నియోగింపఁబడియెను. ఒకనాఁడు భరతుఁడు, కాల్వలకు నీరుగట్టుచు, నానీటియం దనేకపిపీలికములు పడి యావలకుఁ బోవుమార్గము లేక కొట్టుకొనుచుండుటఁ జూచెను. అప్పు డాతఁడు వెంటనే నీటికాల్వల గట్లన్నియు నూడఁదీసివేసెను. తనపొలముగట్లతోపాటు, ఈవలావలల నున్న తక్కిన యన్నిపొలములకాలువల గట్లుగూడ త్రెంపివేసెను. బంధింపఁబడినజల మంతయు నిష్క్రమించుటచే క్షేత్రము లన్నియు నిండిపోఁజొచ్చెను. ఈస్థితిలో శ్రీకంఠుఁడు వచ్చి చూచెను. ఇఁ కేమున్నది? మూర్ఖవాఁడు సర్వనాశన మొనరించివేసెను. శ్రీకంఠుఁ డప్పుడు క్రోధాంధుఁడై మూర్ఖవానికిఁ దనయిచ్చవచ్చినట్లు పరిహారము లభింపఁజొచ్చెను. నిస్పృహాభావముతో నాతఁ డాదెబ్బల నన్నిటిని సహించుచుండెను. అందుచే శ్రీకంఠునిక్రోధము ద్విగుణీ

కృతము గాఁజొచ్చెను. ఆతఁడు దగ్గఱఁ బడియున్న యొక ముండ్లకంచెను జేతఁ బట్టుకొని భరతు నదేపనిగాఁ గొట్ట నారంభించెను. భరతుని వీపంతయు క్షతవిక్షతమునై రక్త ధారలు ప్రవహింపఁజొచ్చెను. ఈయవస్థయం దెక్కడనుం డియో ముక్తికాముఁ డక్కడకు వచ్చిపడి శ్రీకంఠునిచేతియం దలిముండ్లకంచె నూడఁదీసికొనియెను. ఆతఁ డంతటితో నూరకుండక యా ముండ్లకొమ్మతో శ్రీకంఠునిఁ దర్జనభర్జనము గావింపఁజొచ్చెను. అప్పు డాయన్నదమ్ము లిద్దఱు నిజబల ములను జూపుచు ద్వంద్వయుద్ధ మొనరింపఁజొచ్చిరి. ఈభీషణ ప్రదర్శనమునకుఁ జుట్టుపట్టులవా రందఱుఁ బిలువనిపేరంట ముగా మనోవేగముతో వచ్చి చేరిరి. కొంతసేపటికిఁ బ్రేక్ష కులలోఁ గొందఱు ముందఱకువచ్చి పరోపకారపరాయణులై శ్రీకంఠముక్తికాములను ద్వంద్వయుద్ధమునుండి నివృత్తులఁ గావించిరి. ముక్తికాముఁ డప్పుడు నేలం గూలఁబడి యధో వదనుఁడై మిక్కిలి విలపింపఁజొచ్చెను. కమలాదేవి చితి నారోహించుటకు ముందటిగడియలో నొకచేతఁ గుంకుమబరి ణెను వేఱొకచేత భరతునిఁ బట్టుకొని తనతల్లియైనలక్ష్మీదేవికి భరతుని సమర్పించిన యాదృశ్య మిప్పు డాతనిహృదయదర్పణ మునఁ బ్రతిఫలించెను. తనతల్లి యైనలక్ష్మీదేవి భరతునిరెండు చేతులఁ గౌఁగిలించుకొని కన్నీటిధారలచే నాతనిమస్తకమును దడిపివేయుచున్న ట్లిప్పు డాతనికిఁ గోచరించుచుండెను. తండ్రి మూర్తిని గన్నులలోఁ గనుపాపవలెఁ గంఠమునందలి రత్న

హారమువలెఁ బ్రియతమబుద్ధితో సర్వదా యెడఁబాయక రక్షించుచుండినసంగతి యిప్పుడు ముక్తికామునకు దృశ్యమయ్యెను. అశ్రుపూరితము లై యున్న తనకన్నులు పైకెత్తి యాతఁడు భరతునివంకఁ జూచెను. భరతుని వెన్నునుండి రక్తధారలు దిగజారుచుండెను. ఇదివఱ కఱచేలివళమున నాతని దేహమును నంటియున్నధూళి యిప్పుడు రక్తాక్తమై యాతఁ డిప్పుడు రక్తపంకనిమగ్నుఁడై యుండెను. ఆతని పాదమునఁ గంతకుముందు శ్రీకంఠుఁ డనుగ్రహించినయిటుక బొంతదెబ్బవలనఁ బదతలము విదీర్ణమై యుండుటచే దానినుండి శోణితము ప్రవహించుచుండెను. అయినను సదానందమంత్రితుఁడై యున్నతనకనిష్ఠసోదరుఁ డది యంత యుగ్రహింపకయే యున్న ట్లాతఁడు తెలిసికొనియెను. భరతుఁడు తనదేహమునందలిప్రహారములవంక నొకొక్కమాఱు చూచుకొనుచున్నప్పుడుగూడ నాతనినేత్రములయం దానందభావము స్ఫురించుచుండుట ముక్తికాముఁడు కనుఁగొనియెను. ఇఁక నాతఁడు ధైర్యమును జిక్కఁబట్టలేకపోయెను; ఆకులచిత్తమైన యాఁడుదానివలె నార్తస్వరముతో నెలుఁగెత్తి యేడ్చుచు భరతునికంఠమును గౌఁగిలించుకొనియెను. “అయ్యో! వీనిని నేనింక నెవ్వరిచేతులలో నుండనీయను. నాగృహమునం దే యుంచి రక్షించుకొనియెదను” ఈవిధముగా నెన్నియో శపథములు చేసికొనుచు నత్యాదరముతో భరతునిచేయి పట్టుకొని

ముక్తికాముఁడు తనయింటిమార్గము పట్టెను. ఇంటి కేఁగి యా గఁడు ప్రేమాతిశయముతోఁ దమ్ముని దరిఁజేర్చుకొని స్వహస్తములతో నాతని దేహమునందలిదెబ్బలన్నిటికి నౌషధసేచనము నరించెను. కాని భరతుఁడుమాత్రము ప్రీతివిద్వేషములయందు సమానమైనయుదాసీనభావమును జూపుచునన్న యింటనుండెను.

ముక్తికాముని భార్య పేరు 'అనసూయ.' ఈమె సంకీర్ణచిత్తముగలపడఁతి; ఈమెకు ముప్పదివత్సరముల వయస్సు. ఒకఁడే కుమారుఁడు. ఈకుమారుని దఱచుగా భరతుఁ డెత్తికొనుచు నాడించుచుండుట గలదు. ఇందుచే భరతుఁడు వీరింటఁ బ్రవేశించినప్పటినుండియు నీబిడ్డఁడింటిలో నల్లరిచేయుటయుఁ బోరువెట్టుటయు నంతగా లేకుండెను. ముక్తికాముఁ డుదయముననే లేచి నిశ్చింతగా స్వకార్యములఁ జక్కఁబెట్టుకొనుటకుఁ బోవును రెండుయామములైనతరువాత నిలు సేరి స్నానాహ్నికాదు లొనరించుకొని, భోజనాది సదుపాయములను బొంది, తిరిగి బైటికిఁ బోవుచుండును. మరల రాత్రివేళకే యాతఁ డింటికివచ్చును. తఱచుగాఁ బవలంతయు నాతఁ డింటికి దూరముననే యుండుచుండును. అతఁడు తనభార్యతో "భరతునకు వేళపట్టుల భోజనాదిసదుపాయములు చూచుచుండవలయును; అతఁ డాఁకలివేళ కన్నము నడుగఁడు; అందుచే నాతని నెప్పటికప్పుడు వెదకి పిలుచుకొని వచ్చి యాతని కన్నపానాదు లొసఁగుచుండ

వలయు" నని కట్టుదిట్టముగాఁ జెప్పివేసెను. అతఁ డింటికి రాఁగానే ప్రతిదినము ముందుగా "భరతుఁడు భోజనము చేసెనా? అతఁడు సుఖముగా నున్నాఁడుగదా?" అని యడుగు చుండును. ఏదియేని మంచితినుబండారము నింటికిఁ దెచ్చినప్పు డాతఁడు దానిని తనభార్యచేతి కిచ్చి "ముందుగా భరతునకుఁ బెట్టి తరువాత శితికంఠునకుఁ బెట్టుము" అని చెప్పుచుండును. ఆతనికి శితికంఠుఁడు మూఁడేఁడులపుత్త్రుఁడు. ముక్తిశాముఁడు వీథిలోని కేఁగినతరువాత ననసూయ భరతుని బిలిచి శితికంఠు నెత్తికొని యాడించుచుండుమని యాదేశించుచుండును. భరతుఁడు శితికంఠు నెత్తికొని యాడించుచుండును. ఒకనాఁడు బిడ్డను భుజముపై నెత్తికొని యాతఁడు పోవుచుండఁగా దారిలో నొకదేవాలయ మాతనికిఁ గన్పడియెను. వెంటనే భరతుఁడు బ్రహ్మానందపరవశుఁడై మైమఱచిపోయెను. ఆపారవశ్యముచే నాతనికి దేహేంద్రియములు నిశ్చేష్టములై పోయెను. భరతుని మూపుననున్న శితికంఠుఁ డొక్కుమ్మడిగాఁ దాటిపడుపడినట్లు నేలపైఁ బడిపోయెను. క్రిందనున్నఱాయి గ్రుచ్చుకొని శితికంఠునితల నొకపెద్దగాయము పడియెను. ఈవార్త విని వెంటనే యనసూయ యచ్చటికిఁ బరువెత్తుకొని వచ్చి బిడ్డ నెత్తికొని యోదార్చుచు నుపచారములు చేయఁజొచ్చెను. భరతునకుఁ గూడ యథోచితబహుమానము లిచ్చెను. కాని స్వాపరాధ భయముచే నీసంగతి ననసూయ తన భర్తకుమాత్రము తెలుపు

నిచ్చినది గాదు. ముక్తికాముఁడు చెప్పినటు కనసూయకు "భరతునిపై నేమియుఁ గార్యభారమును బెట్టకుము. కేవలముఁ జంటబిడ్డవలె నాతని జాగ్రత్తతోఁ బోషించుచుండుము" అని యుపదేశించి యుండెను. ఏది యెట్లైనను, బిడ్డను భరతుని చేతి కిచ్చుటమాత్రము ప్రమాదకరమని యనసూయ నేఁడు గ్రహింపఁగల్గెను; భరతునిఁ దాను పోషించుట వట్టిగోడ్డుకత్రా కట్టువంటి దనియు నామె యూహించెను. అది మొదలు భరతునియాహారాదికములను జూచువిషయమున ననసూయ, లోలోన నుదాసీనత వహించి యుండెను. ఏదియో యొకవేళ నేదియే నొకింత భరతున కామె భోజన మిడుచుండెను. క్రమముగా నాభోజనపరిమాణముగూడ సన్నగిలుచుండెను. కాని జడభరతుఁ డెప్పటివలె సదానందమయుఁడే. అతఁ డాదరించెడివారియం దెట్లుండునో, ఆదరింపనివారియందును నట్లే యుండెను. వర్షకాలములోను వేసవికాలములోను సామాన్యనదులయందు స్థితిగతులభేదము గన్పట్టుచుండును. కాని మహాంబునిధికి వర్షమున నేమి? గ్రీష్మమున నేమి? దానికి సకలఋతువులు సమానమే.

ముక్తికాముని పెరటిలో నొకప్రశస్తమైన పనసచెట్టుండెను. ఆయూరిలో నెవ్వరిదొడ్డియందుఁగాని దానితోఁ దుల్యముగా ఫలమిచ్చువృక్షము మఱియొకటి లేదని ప్రసిద్ధి. ఈమా ఱాచెట్టున బారుగానున్న కొమ్మయందు నొకపెద్ద

కాయను గాంచెను. ఆకాయ క్రమముగా నెదిగి పండి యిప్పుడు నేలకుఁ దాఁకుచున్నట్లుండెను. అనసూయ యాపండును సదా అతిజాగ్రత్తతోఁ జూచుచునుండెను. ఇఁక మూఁడు నాల్గుదినములలో నది పండి పక్వమునకు రానైయున్నది. భరతుఁ డొకనాఁ డాపనసచెట్టునకనతిదూరములోఁ బెరటి యందు నిశ్చింతగాఁ గూరుచుండియుండెను. ఇంట నొకచోట నుయ్యాలమంచములో శితికంఠుఁడు నిద్రించుచుండెను. అనసూయ యేదియో విశేషకార్యముకొఱకుఁ బొరుగువారింటికిఁ బోయియుండెను. ఆసమయములో రెండునక్కలు వారిపెరటిలోఁ బడి పనసపండును బోటాపోటీలమీఁదఁ జీల్చివేసి చెట్టునుండి యూడఁదీసినవి. అంతటితోఁ బోవక యారెండునక్కలు ఆపండును జెఱియొకప్రక్క పంటఁ గఱచుకొని లాగులాడుచుఁ దోఁటలోని కీడ్చుకొనిపోయినవి. ఇంతయేల—ఆ సృగాలములు వచ్చినదిమొదలు జరిగిన సమస్తవ్యాపారము మన భరతుఁడు మాత్రము చూచుచునే యుండెను. ఆతఁ డించుక శబ్దముచేసినను లేచి నిలుచుండినను జాలు; ఆనక్కలు భయపడి పాఱిపోయి యుండును. కాని యేజీవి యాహారమునకైన నాతఁడు వ్యాఘాతము కల్గించునా? ఆతఁ డట్లెంతమాత్రముఁ జేయలేదు. అక్కడ నక్కలు పండుకొఱకు బెనఁగులాడుచు నూరెగిరిపోవునట్లూళవఁజొచ్చెను. ఆధ్వని విని యనసూయ పరుగుపరుగున నింటికిఁ బరుగెత్తుకొని వచ్చి పెరటిలోఁ బడియెను. విషయ

మంతయు నామెకు విశదమయ్యెను. పాప మామె యెన్ని దినములనుండియో, గంపెఁడాసతోఁ గాపాడుకొనుచున్న పనస పండీవిధముగా భగ్నతపాలై పోయెను. వెంటనే యామె యొక్కమాఱుగాఁ గ్రోధాంధురాలై పోయెను. రౌద్రమూర్తితో—మనోవేగముతో భరతునివంకకుఁ బరుగెత్తుకొని వచ్చి యాతనికిఁ జేమూరఁ జెళ్లున నొక్కదారుణచపేటము వడ్డించి వేసెను. భరతుఁ డామహాప్రసాదమున కించుకయైన విరక్తి భావమును గాని దుఃఖభావమును గాని చూపింపనేలేకపోయెను. అప్పు డనసూయ "అయ్యో! పనసపండిల్లు భగ్నమైపోయెను. మంచములోని బిడ్డఁడుగూడ నిల్లు మాయము గావలసినవాఁడే గదా! ఈమూఁగనిర్భాగ్యునివలన నాకేమిఫల మున్నది?" అని యనుకొనఁజొచ్చెను. అదిమొదలు మాటిమాటికి మన భరతునకుఁ జెంపకుఁ జేరెఁడేసిలెంపకాయలు లభించుచునే యుండెను. ఆతనిభోజనపదార్థములుగూడ నికృష్టములై నికృష్టతరములై పోవుచుండెను. మునుపటివలెనే యితరులతో సంబంధము గల్గించుకొనిన, మునుపటివలెనే యధఃపతనము నొందఁగలను, అనుభయముచే భరతుఁడు నిశ్చలుఁడై మూఁగ వానివలెను జెవిటివానివలెను గాలము గడపుచుండెను. తన యాత్మను భగవంతునిపాదములయం దర్పించి పరమస్థైర్య మవలంబించి జడునివలె లోకనిగ్రహమునకుఁ బాత్రుఁడై యుండెను.

# జడభరతుఁడు.

## పండ్రెండవ ప్రకరణము.

ఒకమాఱు ముక్తికాముఁడు కార్యాంతరములచే నాల్గు దినములు పొరుగూళ్లకుఁ దిరుగవలసివచ్చెను. అప్పు డాతని పొలము పంట కోఁతకు సిద్ధముగా నుండెను. ఏ రాత్రివేళ నే దొంగలు పొలము కోసికొని పోవుదురో యని యింట ననసూయ భయపడుచుండెను. ఆమె కేమియు నాలోచనకు పాలుపోవుట లేదు. కానిప్పుడు ధైర్యము తెచ్చుకొని, యప్పు డామె మరల భరతుని బిలిచెను. భరతుఁడు వచ్చి యనసూయ యెదుట నిలిచెను. "మీయన్నగారు పరూరినుండి వచ్చునంతకు నీవు మనపొలములోఁ గాపుండవలెను. పొలములోఁ జెట్టు క్రింద నున్నమంచెపై నీవు రాత్రులు పరుండుచుండుము. ఈమాత్రమైన సొంతపనులు చేయలేకున్న నింకెట్లు? నీవక్కడ జాగ్రత్తగాఁ జూచుచున్నచో దొంగలు పొలములోనికి రారు" అని యనసూయ యాతనితోఁ జెప్పెను. "ఈ వెఱ్ఱివాఁడు దొంగలు రాకుండునట్లు నలుమొగములఁ గాచికొనలేకపోయి నను నామాజ్ఞ ననుసరించి పొలమునకుఁ బోయి మంచెపై మాత్రము రాత్రులు నిర్ధాయుకముగాఁ బండుకొనుచుండెను,

మంచెపై మనుష్యుఁ డుండుట గన్పట్టి దొంగలు వచ్చుటకు సాహసింపరు. అంతియే చాలు" నని భరతునినవిశిగా తూహించుకొనెను. భరతుఁడును సంతుష్టచిత్తముతో మంచెపై నివసించుచుండెను. ఏది యెట్లున్నను జనసమ్మర్దమునకు దూరముగా నున్నయవ్వోట నారాత్రులయందు దామంచెపై భగవదారాధనముతోఁ గాలము గడపుటకు మనభరతునకు మిక్కిలి యనుకూలత గల్గియుండెను. ఆరాత్రి అమావాస్య రాత్రి. భరతుఁడు స్థిరచిత్తుఁడై పొలముప్రక్క నున్నమంచెపై నుండెను. నాల్గుదిక్కులు గాఢాంధకారములో మునిఁగి యున్నవి. పొలమునకుఁ సామీప్యమునందుఁ దీవ్రప్రవాహినియై "రక్తాంబర" యనునది ప్రవహించుచుండెను. వాయుతాడితనదీతరంగసంఘర్షణధ్వనులు వినవచ్చుచుండెను. ఆకాశమునందలి నక్షత్రపంక్తులు రక్తవర్ణపుంవలె దీప్యమానములగుచుండెను. ఎదుట నున్న 'రత్నపురి' యనుపల్లె నిశాదేవి నీలాంబరములో దాఁగికొన్నట్లు కనఁబడకుండ నుండెను. భరతుఁడు ఘనానందముతో బ్రహ్మానందానుభవముచేయుచు ధ్యానపరుఁడై యుండెను. ఇట్టిసమయమునందు దొంగల నాయకుఁ డొకఁడు, కొందఱుమూర్ఖులైనయనుచరులతోఁ గలసి కోలాహల మొనరించుచు నచ్చటికరుగుదెంచెను. ఆదొంగల గుంపు పుత్రలాభము నుగోరి కాళికి నరబలి నిచ్చుటకు సంకల్పము చేసికొనియుండెను. ఈ బలికి నిమిత్త మొకదురదృష్టవం

తునిఁ బట్టుకొని వారిదివజకుఁ గట్టియుంచిరి. కాని వాఁడదృష్టవశమున నెట్లో తప్పించుకొని దొంగల చేతులలోనుండి పలాయితుఁ డయ్యెను. భీభత్సమూర్తులైనయనుచరులు, ఇప్పుడానరపశువును వెదకుచుండిరి. వారితో ననేకము లగు 'కాఁగడ'లు ప్రజ్వరిల్లుచుండెను. ఆవెల్గుచే నచ్చటియంధకారము దూరమగుటయే గాక, యామయమావాస్యరాత్రి పట్టపగటివలెఁ బ్రకాశించుచుండెను. ఆ 'కాగడ'కాంతులతో నాదొంగలు పొలముదరికి వచ్చునరికి పొలములో నొకమంచెపై నొకమనుష్యుఁడు వారి కగపడియెను. ఆతనికటిసీమ నతిమలినజీర్ణాంబరము. ఆతనిశిరోజములు జటాబద్ధములు. ఆతనిదేహము ధూళిధూసరితము. వారాతనిని "నీవెవ్వడు?" అనియడిగిరి. జడభరతుఁ డేమియు సమాధాన మీయు లేదు. దొంగలలో నొకఁడు "నీవు లేచి మావెంట రమ్ము" అనియెను. జడభరతుఁ డాదొంగవానియాజ్ఞ భగవదాజ్ఞగా భావించి దొంగల గుంపుతో నడువఁజొచ్చెను. భరతుని బిలిచినదొంగవాఁడు తనసహచరులతో నిమ్మళముగా "నీ మూఁగవానిదేహము మంచిబలిష్ఠమైనది. సౌష్ఠవమైనది. ఉజ్జ్వలకాంతిమంతమైనది. కాని ధూళిధూసరితమై యున్నది. పాఱిపోయిననరపశువుస్థానము వీనిచేఁ బూర్తిచేయఁగలము." అనిపలికెను. సహచరు లందఱును వాఁడాలోచించినదాని కామోదించిరి.

వనదుర్గమునందు దొకపూజ జరుగుచుండెను. ఒకప్రక్కల

మండపముయొక్క ఇటుకగోడపై రావిచెట్టొకటి విజృంభించి యుండెను. దానివేళ్లు లాజీర్ణగృహమునందలియంతర్భాగముల యందు స్ఫుటముగా వ్యాపించి పైకిఁ గన్పట్టుచుండెను. అశ్వత్థ మూలములచే నలముకొనఁబడిన యూపశిల్లు నాగపాశబద్ధమైనట్లగపడుచుండెను; దానిసామీప్యము నందుఁ బురాతనపుష్కరిణి యొండుండెను. అది నాచుచేఁ గప్పఁబడిపోయెను; ఆ పుష్కరిణిరేవునం దొకచో నరకంకాళములతునుకలుమాత్రము కనఁబడుచుండెను. ఆజీర్ణమందిరమున కతిపురాతనమైనభగ్న ప్రాకారముగూడఁ గలదు.

ఈప్రాకారములోనే దొంగలనాయకుఁ డనుచరులతో వాసము చేయుచుండెను. పురోహితుఁ డాదొంగలనాయకుని కపాలమునందు రక్తచందనముతోఁ ద్రిపుండ్రమును దిద్దెను. దొంగలగురువు ఎఱ్ఱపట్టుబట్టను ధరించి యుండెను. అతని గళసీమను జపాపుష్పమాల వ్రేలాడుచుండెను. నాల్గుదిక్కుల యందు నాతనియనుచరులు శంఖఘంటాదినానావిధవాద్యములను మ్రోయించుచుండిరి. ఆమందిరమధ్యమునందుఁ బురోహితునిచేతిలో నున్నపంచహారతి పొగచేఁ జుట్టుకొనఁబడి మందముగా వెలుగుచుండెను. ఆదీపకాంతులలో నామందిరమునందలి కరాళకాళికామూర్తి వరాభయహస్తపంక్తులు విశేషభావములతోఁ గన్పట్టుచుండెను. వినాశకారిణి యయ్యు నామె రక్షించుననే యుండెను. ఆదేవియభయహస్తచిహ్నముల

చేతనే యీసంగతి విస్పష్టముగా సూచింపఁబడుచుండెను. పురోహితుఁడు మంత్రములను బఠించుచు నొక్కుమాఱు గృహబహిర్ద్వారమునకు విచ్చేసి "బలి యింకను సిద్ధము గాలేదా?" అని ప్రశ్నించుచుండెను. భటుఁడు "ఇంత పర్యంతమును వాండ్రు తిరిగి రానేలేదు. చాలనాశ్చర్యముగా నున్నది? పాఱిపోయినపశువు దొరకకున్నచో, నిద్రపోవుచున్న యేవ్యక్తినైనను గికురించి నిమ్మళముగా బంధించి తెచ్చివేయ వలయు నని నేను సిడనారాయణునితో నేకాంతముగాఁ జెప్పి యున్నాను. వాండ్ర కింకను నెవ్వరు దొరకలేదని తోఁచు చున్నది; మీరు నిశ్చింతతో మంత్రపఠనము గావించు చుండుఁడు" అని చెప్పెను. అంతలో జడభరతునిఁ దీసికొని యనుచరవర్గ మరుదెంచెను. పూజాగృహమునం దున్నదొంగలు దూరమునుండియే "కార్య మేమైనది? ఏమైనది?" అని కేకలు వేయుచు నడుగఁజొచ్చెను. సిడనారాయణుఁడు "కార్యము ఫలించినది, కాని వాఁడుమాత్రము దొరకలేదు" అని సమాధానముఁ జెప్పెను. అప్పుడు జయధ్వనులు మఱింత మిన్ను ముట్టి పోఁజొచ్చెను. పూజామందిరములో శంఖ, ఘంటికా ధ్వను లొక్కుమాఱుగానే మ్రోగిపోవుచుండెను. పిమ్మట మద్యపానోన్మత్తులైనదస్యులందఱు జపాపుష్పమాలల ధరించి నృత్యము లొనరించుచుఁ బురోహితునిపైఁ బడఁజొచ్చిరి. పురోహితుఁడును బంచహారతిని జేతఁ బట్టుకొని దేవి కార

తీయఁజొచ్చెను. ఇప్పుడు వానిమోమునుండి వజ్రగంభీర నినాదముతో మంత్రము లదేపనిగా నుచ్చరింపఁబడుచుండెను. దొంగలు జడభరతునకు స్నాన మొనరించి తీసికొని వచ్చిరి. జడభరతుఁ డప్పుడు తనయవస్థను దెలిసికొనెను. అతఁ డుద్దేశపూర్వకముగా బ్రహ్మానుసంధాన మొనరించుచు నిశ్చేష్ట దేహుఁడై యుండెను. అయినను ధైర్యముతో నంత్యకాలమున కెదురుచూచుచుండెను. ఆతనిముఖమండలమునం దించుకైన వికృతభావము స్ఫురించుటలేదు. వినిప్రకార మాతని నొకచోఁ ద్రాళ్లతో బంధించి దొంగలు చండికాలయమునకుఁ దీసికొని పోయిరి. చివరకు ధూప, దీప, మాల్యములు, పల్లవములు లాజలు, ఫలములు మొదలగునుపహారము లిచ్చి యాతనిని పురోహితుఁడు కాళికి నివేదనఁగావించెను. మరల నట్టహాసము తో శంఖ, ఘంటాదిధ్వనులు మిన్నుముట్టుచుండెను. దస్యులు తెయితక్కమని నృత్యము లొనరించుచుండిరి. పురోహితుఁడు శక్తికొలఁది నాకాశము ప్రతిధ్వనించున ట్లుచ్చైస్స్వరముతో మంత్రోచ్చారణ మొనరించుచుండెను. ఆసుందరమూర్తి భయావహమై యుండెను. గంధమాల్యాలంకారభూషితుఁడై కౌశేయ పరిధానపరిహీనుఁడై భరతుఁడు యూపస్తంభమునకుఁ గట్టఁబడెను. అతనిమోమునందు దొంగలు తిలకమును దిద్దిరి. ఈ యపూర్వాలంకారములచే భరతుఁ డప్పుడు సాక్షాత్కరించిన శ్రీమహావిష్ణువువలెఁ దేజరిల్లిపోవుచుండెను. ఎప్పుడు తన

జీవితములో నెవ్వరినిగూడ ద్వేషించి యెఱుగఁడో—ఇతరులు తనకాచరించుననేకము లగునత్యాచారములలో నొకదానికైన నొకనాఁడైన నెవ్వఁడు ప్రతీకార మొనరించి యెఱుఁగఁడో, సామాన్యము లైనపిపీలికముల సంరక్షించుటకు భయానకము లగుతనయన్న చేతిదారుణపరిహారముల నెవ్వఁడు సహించుచుండెనో,—తన్నుఁ గాళికాదేవికి బలియిచ్చుటకుఁ బిలిచినవారి పిలుపును భగవంతునిపిలుపుగా నెవ్వఁడు పరిగణించెనో—తన జీవితమునం దెవ్వరికి నెప్పుడు నేవిధమగుకష్టమును గల్గింపక, ఉత్కటపరిచర్యావృత్తిచే నిర్విచారముతో నెవ్వఁడు సకలజనులకు సేవలొనరించుచుండెనో—ఆభగవద్భక్తిమూర్తి, ఆబ్రహ్మజ్ఞాని ఆపరమసౌమ్యస్వరూపుని, ఆభరతునికరచరణముల బంధించి దొంగ లాతనినుత్సుకను యూపస్తంభమున కంటఁగట్టిరి. ఇట్టి సమయమునందు అమావాస్యనిశీథిని భేదించుకొని, కరాళ కాళీదేవి లేలిహానదీర్ఘజిహ్వాగ్రిమువలె నెక్కడనుండియో యొక్కవజ్రాయుధమువచ్చి, తక్షణమే రుద్రసహాయునికంఠము ఖండించుకొని పోయెను.

ధార్మికమహాత్ముఁడైనభరతుయనకుఁ గల్గినయీయవస్థన సహింపఁజాలక భూదేవి భీషణక్రోధకంపిత యైనదిగాఁబోలును ఆకస్మికముగా నప్పుడు భూకంప ముదయించెను. దానితో వెంటనే యాజీర్ణమందిరము నేలమట్టమయ్యెను. పురోహితుఁ డామందిరముతో విఱిగి నేలఁగూలెను. భరతుని బలివెట్టుటకు

ఖడ్గమును శాణమును జేతబట్టుకొని నిలిచియున్న మనుష్యుఁడు మూర్ఛితుఁడై భూమిపైఁ బడిపోయెను. సిదనారాయణుఁ డప్పు డీల్లు కేలు వేయఁజొచ్చెను. "బ్రహ్మతేజము! బ్రహ్మతేజము! అన్నా! బ్రహ్మతేజము! నేను స్నానము చేయింపఁ బోవునప్పు డీతని మెడలో జన్నిదముఁ జూచితిని. ఈతఁడు కేవలము బ్రాహ్మణుఁడుమాత్రమే గాఁడు. ఎవ్వఁడో సాధు పురుషుడు".

"అవు నవును! చూడలేదా పట్టుకొనునప్పుడు గాని బంధించునప్పుడు గాని యీతఁ డొక్కచమత్కారమైనను జేయలేదు. యూపస్తంభమునం దీతఁడు, ఉపధానమునందు వలెనే సుఖభావముతో శిరసుంచెను." అని యింకొకదొంగ పలుకఁజొచ్చెను.

ముహూర్తమాత్రమున నాదొంగలు భరతునిబంధనములను విప్పివైచి, బ్రహ్మశాపమువలనఁ దమకేమి సంభవించునో యనుభయముచే వారిద్దఱు నాతని దీసికొనిపోయి పొలములో నెప్పటిమంచెయం దెక్కించిరి. మఱియుఁ దెల్లవాఱఁగానే యెవ్వరికైన నేసందేహమైనఁ గలుగఁగల దని యెంచి యాతనిపట్టుబట్టను భూషణములను దీసివేసి యెప్పటి మలినాంబరమును గట్టఁబెట్టిరి. మోమునందలి తిలకమును తుడిచివైచిరి.

భరతుం డెప్పటియట్ల మంచెపై నుండి క్రమముగా మూఁడురాత్రులు కావలి గాచెను.

అనసూయ యప్పుడు "వదినెగారిచెప్పుచేతలలోనుండి భరతుం డిప్పు డించుక పనిపాటులను నేర్చికొనుచున్నాఁడు" అని సంతోషించుచుండెను. ఆమె కిప్పుడు భరతునకు నాల్గు మెతుకులు వేయుటయం దంతగా విరక్తి గలుగుటలేదు.



నడచుచున్నట్టి యొకానొక నిరుపము జడభరతుని జూచి - "ఇక్కడ నొకబలిష్ఠుడైనమనుష్యు డొంటరిగా గూరుచుండి యున్నాడు. వీడు శిబికారోహణమునకు దగినవాడు. సందేహము లేదు." అని పలికెను.

వెంటనే వారిలోనుండి వేఱొకనిరుపు డరుదెంచి భరతునిచేయి పట్టుకొని పల్లకికడకు దోడ్కొనిపోయెను. భరతుడును వృథావాక్యవ్యయము సేయనివాడు గావున నా పల్లకిదండెను దనభుజముపై బెట్టుకొనియెను. ఆతడు కేవలమనకయే పల్లకిని మూపున ధరించుటచే వారందఱు నీతని వృత్తి గాబోలు నని భావించుకొనిరి. బోయవాండ్రు తమకొఱవ యైనందుల కాలోటు తీఱిన దని సంతుష్టులైరి.

ఆ పల్లకి సింధుసౌవీరాధిపతి యైన 'రహూగణ' మహారాజుది. పాపము నోరెత్తకుండ బల్లకిమోయుచున్న మనభరతుడు తనయూహ యైనమాట నిజమే కాని యాతనినడకమాత్రము బోయవానినడకవలె సముచితస్థితియందు లేకపోయెను. స్వేచ్ఛగా బదవిక్షేప మొనరించినయెడల దనయడుగుల క్రింద బడి యేజీవజంతువులైన జావగల వనుభయముచే భరతుడు ప్రతియడుగును సవిమర్శముగా వేయుచుండెను. ఈకారణముచే దక్కినశిబికావాహకులయడుగులతో నీతనియడుగులు కలియక గతిభేదము సంభవించెను. దీనిచే బల్లకి యొకప్రక్క కొంచె మొఱిగిపోయి రెండవప్రక్క తేలిపోజొచ్చెను. ఒఱిగి

పోయిననున్న బోయలకణతలు గభాలుమని బ్రద్దలగుచుండెను.

సింధుసౌవీరాధిపతికిఁ గోపము వచ్చెను. "పల్లకి యిట్లు వికారగమనము చేయుచున్న దేమి?" యని యాతఁడు కేక వేసెను. తక్కినపల్లకిబోయలందఱు "మహారాజా! యీ క్రొత్తబోయ వమగతితో నడువకున్నాఁడు" అని యుత్తర మిచ్చిరి.

రాజు పల్లకిలోనుండి తొంగిచూచెను. క్రొత్తబోయ వాఁడు మిక్కిలి బలిష్ఠుఁడుగాఁ గనఁబడియెను. అప్పు డాతఁడు వ్యంగ్యస్వరముతో "ఓహో! లోహపిండమువంటియీ దేహముతో నీమాత్రముబరువు మోయుటకే భయపడుచుంటి వేమి? ఓరీ! గాడిదా! ఇఁకనైన జాగ్రత్తగాఁ బనిచేయుము" అని పలికెను.

భరతుని దేహమునందు సుఖదుఃఖములయనుభవము లేదు. మనస్సునందు దేహాభిమానము లేదు. ఆ మహారాజు నదలింపు లించుకంతయు భరతునికి మార్పు గలిగింపలేకపోయెను. ఎప్పటియట్లే యాతఁడు యథేచ్ఛముగా నడచి పోవు చుండెను. పల్లకియు, నసమగతిచే నొకమాఱు క్రిందికిఁబడుచు నొకమాఱు పైకి లేచుచుఁ బోవుచుండెను.

ఈమాఱు రాజత్యంతకుపితుఁ డయ్యెను. అతఁడు "ఓరీ! బోయ! పశువా! రాజాజ్ఞను మీఱినఫలము నీవి ప్పుడు ననుభవింపలేదా? దాని నిప్పుడే యనుభవింతువు గాక!

నీదేహ మిప్పుడే ఖండవిఖండములు గాఁగలదు చూడుము.'' అని గర్జన మొనరించెను.

జడభరతుఁడు, తనజీవితమునందు మాటాడుట కిదియే ప్రథమపర్యాయము. వాణి స్వయముగా నాతనిజిహ్వాగ్రమునకు వచ్చెను. ఆతఁ డమృతస్నిగ్ధకంఠముతో శుద్ధసంస్కృతభాషయం దీభావము వచ్చునట్లు మాటలాడెను.

“మోయువాఁడను నేనా? నీవా? నాకు దేహాభిమానము లేదు. ఈభుజమున శిబికాదండము స్పృశించి యున్నది కాని దీనిని మోయుచుంటిననుభావముమాత్రము నాకు లేదు.

ఇఁక నీవెవ్వరవో నీవు తెలిసికొమ్ము. తండ్రి యని, పుత్త్రుఁ డని, ప్రభు వని, విచిత్రభేదభావములు నీయాత్మను మిక్కిలి పీడించుచున్నవి. నీ వహంకారస్వరూపుఁడవై యీ శిబిక నారోహించితివి. నీవజ్ఞానభారమును వహించియున్నావు. ఇందుచేతనే నీస్వరూపము నీకుఁ దెలియఁబడుట లేదు. నీవొక రాజాధిరాజ నని మాత్రము గర్వించుచున్నావు. మార్గము నందలిమార్గస్థుని బట్టుకొని జీతబత్తెములు లేక పల్లకిని మోయించుకొనుచు నీవిధముగా జనపరిపాలన మొనరించుచున్నావు. నీవెంతటినిష్ఠురుఁడవో చూచుకొమ్ము. మఱియు నా దేహమును ఖండవిఖండములు గావించెద నని భయపెట్టుచుంటివి. ఈనశ్వరదేహ మనుమంటికుండ పగిలిపోవుటకు నేను భయమొందను. దీనితో సంబంధమును నేను చాలకాలము

క్రిందటనే విడిచిపెట్టితిని. నీవు నీయిష్టమువచ్చినట్లు చేసికొనవచ్చును."

ఈమందలింపులాపరమకారుణికోత్తమునిముఖపద్మమునుండి పరిమళించెను. రాజు, అడియాసలేనిచిత్తముతో స్నేహమయమైనయీయుపదేశమును విని తెలివి దెచ్చికొని మాఱుమాటాడక పల్లకినుండి దిగి చేతులు రెంటను జోడించుకొని పలికెను.

"నీవెవ్వరో మహాత్ముఁడవు! ఇట్టియపూర్వమైనయుపదేశామృతమును నేను నాజీవితమునం దెప్పుడు ననుభవించి యెఱుఁగను! స్వామీ! నేనిప్పుడు, బ్రహ్మజ్ఞానము నెఱుంగఁగోరి కపిలాశ్రమమునకుఁ బోవుచున్నాను. నీవు స్వయముగాఁ గపిలుఁడవో, బృహస్పతివో తెలియఁజాలను. నిన్ను హీనకార్యమునందు నియోగించి యిప్పుడనుతాపమున నేనిప్పుడు నిలువున దగ్ధమగుచున్నాను. దీనాతిదీనుఁడైనయీనేఁటివాని దోషమును మన్నించి బ్రహ్మజ్ఞానమును బ్రసాదింపుము! నీవు సిద్ధమహాపురుషుఁడవు—నిన్నుఁగాంచి నీవాక్యములు విని, నేను నీజాడఁ దెలిసికొంటిని."

జడభరతుఁడు—"ఆత్మవంచకునకు బ్రహ్మజ్ఞానము లభింపదు. మహారాజా! నీవు వైభవమధ్యమునందుండి యహంకృతుఁడవై బ్రహ్మజ్ఞానము సంపాదింపఁజాలవు. తోడి మానవులను హీనదృష్టితోఁ జూచి వారిసుఖములపైఁ బ్రక్కి

సెక్కించి, వేత్రహస్తులచే భద్ధభములఁబోలె వారిని నొందిం చుచు, బ్రహ్మజ్ఞానముఁ బడసిపరిత్యాగతో నీవు కపిలాశ్రమము నకుఁ బోవుచున్నావు. మహారాజా! నీకిప్పుడు బ్రహ్మజ్ఞాన మెంతదూరమునం దున్నదో, కపిలాశ్రమమున కేఁగినను నంత దూరముననే యుండును.'' అని చెప్పెను.

రహూగణమహారాజు వ్యాకులభావుఁడై—''బ్రహ్మ జ్ఞానలాభమున కెట్టియవస్థాంతరమును బొందవలయునో తెలిసి కొనుట కత్యంతవ్యాకులుఁడనై యుంటిని. నేను పాపిని, తాపిని—బ్రహ్మజ్ఞానము నొందుటకు నాకు నధికారము లేదు. అయినను మీయట్టివారిసంగలాభముచే నేను బవిత్రుఁడ నగు చుంటిని. స్వామీ! నీవు నాయందు సదయుఁడవు కమ్ము. నా కొఱకు బ్రహ్మతత్త్వమును దెల్పుము. ఆధ్యాత్మికవిషయము నందు నేకనేకమతములను విని విచలితుఁడనై పోయితిని. ఇందుకయి నిశ్చయము నొనరించుకొనఁజాలకున్నాను. ఇందుచేఁ గల్గినహృదయతాపమును జల్లార్చుకొనుటకే కపిలాశ్రమమున కుఁ బోవుచున్నాను'' అని విన్నవించుకొనియెను.

భరతుఁడు—నీవీసంబంధములో, నేయేమతములనువిని యుంటివో వానినిగూర్చి నాకు వివరించి తెల్పుము.

రహూ—స్వామీ! నాసభయందు సకలశాస్త్రవిదు లైనపండితులైదుగురు కలరు. వారు సర్వదా ఆధ్యాత్మిక విషయమునందే తర్కవితర్కము లొనరించుచుందురు. వారిలో

నెవ్వరు నిచ్చా యిచ్చుటకు బరాభవము నొంది యుండ లేదు. ఈమైదుగురిలో నన్నిఁటఁ బెద్దవాఁడు "జటాధరుఁడు" అతఁడు—ఈప్రపంచమునందలి సకలమానవుల నొక్కమాఱు గా నుఱుమాడి యంతయు నిర్మనుష్యము గావించినను, అది పాపకార్య మని భావింపఁడు; లోకములోనిసమస్తపదార్థము లు నెవ్వరైన ముత్తియాన్నులై దానముగాధారవోయవచ్చినను అపఁడది పుణ్యకర్మ యని యెంచఁడు. పాపపుణ్యములనునవి మనుష్యకల్పనామాత్రము లనియే యాతనిమతము.

నాయాస్థానమునందలి రెండవపండితునిపేరు కామేశ్వరుఁడు. అతఁడు—"ధనువునుండి విడువఁబడినబాణము దాని వేగమునుబట్టి యెంతదూరము పోఁగలదో, అంతదూరమే పోఁగలదు గాని యంతకుఁ దక్కువదూరమునఁగాని యెక్కువ దూరమునఁగాని పడఁజాలదు. అట్లే జ్ఞాని గాని యజ్ఞాని గాని తనకర్మఫల మెంత గలదో, అంతియే యనుభవింపఁగలఁడు; కర్మము నతిక్రమించుట యెవ్వరికిని సాధ్యముగాదు. స్వాభావికముగా జన్మపరంపరలచేఁ గర్మక్షయము పొంది జీవుఁడు శాంతిలాభమును బొందుచున్నాఁడు" అని చెప్పును.

మూఁడవపండితునినామము నిర్గ్రంథదేవుఁడు. అతని మతమునందు—ఏడువిధములైనద్రవ్యములచే జగత్తు నిర్మింపఁ బడినది. ఈవస్తువు లేకింటి నెవ్వరు సృష్టింపలేరు. అవి శాశ్వతపదార్థములు, నిర్లిప్తములు, నిశ్చలములు. జలము,

వాయువు, అగ్ని, పృథివి, సుఖము, దుఃఖము, ఆత్మ. ఇవియే సప్తద్రవ్యములు. ఏజీవజంతువునకైన నొకవాఁడిగలకత్తిపోటుచేఁ గాని మరియేకారణముచేఁ గాని మృత్యువు సంభవించిన దనఁగా—నీసప్తద్రవ్యములకూడికకు నా కారణముచేతనే యభ్యంతరము గల్గిన దనియర్థము.

చతుర్థపండితుఁడైన పుణ్యాజిత్తనువాఁడు—ఆత్మస్వరూపము నెఱుంగుటకు 'రూపస్కంధము' 'వేదనాస్కంధము' 'సంస్కారస్కంధము' 'విజ్ఞానస్కంధము' నను నాలుగుభావముల నుత్తరింపవలసియున్నదని చెప్పుచున్నాఁడు కాని వాని నెట్లు దాఁటఁగలమో ఆమార్గమును మాత్ర ముపదేశింపఁడు.

అయిదవవాఁడైనసుబాహుదేవుఁడు—అణువాది. ఈతఁడు పరమాణువులమూలముననే జగత్తు ప్రకాశించుచున్నదని చెప్పుచున్నాఁడు. ఆత్మయుఁ బరమాణువులవలననే పరిణతమగుచున్న దని యీతనిమతము.

ఓ బ్రహ్మజ్ఞమూర్తీ! నేనీకోలాహలమయమైనకూటతర్కములోఁ బడి, చిరంతరముఁ గొట్టుకొనుచున్నాను. ఇందుకొఱకే సంశయవిచ్ఛేదన మొనరించుకొనఁగోరి, కపిలాశ్రమమునకుఁ బోవుచున్నాను.

జడభరత—రాజులు, సభాలంకారముకొఱకు చిత్రవిచిత్రరీతులఁ బండితులను బోషించుచుందురు. నీవును న

యీపండితపరిషత్తులను రక్షించుచున్నావు. నీకిప్పుడు బ్రహ్మజ్ఞానము సంపాదింప నిచ్ఛ పొడమినది. కాని నీకది లభించుటకు నీయందలిసాత్త్వికలోప మడ్డునచ్చుచున్నది.

అప్పుడు సింధుసౌవీరపతి యైనరహూగణమహారాజు తనశిరమునందలిమాణిక్యఖచితముకుటమును దీసి నేలపై నుంచి జడభరతునిపదద్వయము నాలింగనము చేసికొని "మహాత్మా! నీమాట లమృతపుదేటలవలె నాచెవులకు విందు సేయుచున్నవి. నేను పాపిని, తాపిని; నన్ను వంచనసేయక నాకు నీసదుపదేశము నొసంగుము" అని ప్రార్థించెను.

భర—"రాజా! బ్రహ్మజ్ఞానము లభించిన జీవుని స్థితి నేనువి వర్ణించి చెప్పఁగలను? అగ్నిమాంద్యముచేతను, నేత్రరోగముచేతను చిరకాలమునుండి బాధపడుచున్న యొకరోగగ్రస్తుఁడైనవ్యక్తి, యొప్పటిసదారోగ్యమును పొందినను, శృంఖలితహస్తుఁడై కారాగారనిబద్ధుఁడైనవానికి దీర్ఘకాలమునకు బంధవిమోచన మైనను, ఇతరులచే విక్రీతుఁడై ప్రతిదినము తర్జనభర్జనము లనుభవించుచుండువాని కాకస్మికముగా స్వాతంత్ర్యలాభము గల్గినను, మరుభూమిమార్గములయందు క్షుత్పిపాసలచేఁ గాతరుఁడై, నిరాశాపీడితుఁడై, చిరభ్రమణముచేయుచుండుపథికున కాకస్మికముగా ధనధాన్యసమృద్ధము, శీతలజలసంశోభితము నైననగరము దృష్టిగోచరమైనను; అప్పుడువారి కవస్థాంతరములచే నెట్టి యానందము

గల్గునో యది కూడఁ దత్త్వజ్ఞానమువలనఁ గలిగెడి యానంద మునకు సాటి గాఁజాలదు. బ్రహ్మానందము సామ్యరహిత మైనది. నేనెన్ని యుపమానములచే దానిని బోధింపఁగలను ? మహారాజా ! ఎవ్వరైనను, బర్వతశిఖరమునందు నిలిచి, క్రిందఁ బ్రవహించుచున్న నిర్మలప్రవాహమును జూచుచున్న ప్పుడు, ఆ నిర్మలజలమునం దడుగుననున్న గండ్రయిసుక, ఱాళ్లు, శంఖములు, జలజంతువులు మొదలగువాని నెట్లు విస్పష్టముగాఁ జూడఁగలరో, తత్త్వజ్ఞాని యైనవాఁడు నట్లే జీవులు వాసనా వశులై పొందుచుండు కష్టపరంపరలను సాక్షీభూతుఁడై చూచు చుండును. అణిమ, లఘిమ, మహిమ మొదలగుశక్తులన్నియు బ్రహ్మజ్ఞానికిఁ గరతలామలకములు; కుమ్మరివాఁడు తనయిష్ట మైనకుండలను జేయఁగల్గునట్లే, స్వర్ణకారుఁడు తనచిత్తమున కైనభూషణాదులను నిర్మింపఁగల్గునట్లే, చిత్రకారుఁడు తన మనసువచ్చినచిత్తరువులను వేయఁజాలునట్లే, బ్రహ్మజ్ఞాని యైన మహాత్ముఁడు తనయిచ్ఛవచ్చినయాకారమును ధరింపఁగల్గు చున్నాఁడు. కాని, బ్రహ్మజ్ఞాని యానందము చెప్పుటకు శక్యముగాదు. బ్రహ్మజ్ఞాన మెప్పుడు నెవ్వరిచే నెంగిలిచేయఁ బడలేదు. దానిని యథార్థముగా నితరులకుఁ జెప్పఁగలవా రెవ్వరును లేరు." ఇట్లు చెప్పుచు జడభరతుఁడు నిశ్చేష్టుఁడై పడి పోయెను. అతనినేత్రద్వయమునుండి స్వర్గీయము లగుసపూర్వ భావములు ప్రకటితము లగుచు సాశ్చర్యగాము లగుచుండెను.

అతఁడు తనకుఁడిచేయి చాపి వ్రేలితో నేదియో దివ్యసుఖ ధామమును జూపింపసాగెను. ఒకపున్నాగవృక్ష మాయోగీశ్వరుని దేహమున కప్పు డాశ్రయమయ్యెను. అతఁ డప్పుడు నిశ్వాసశూన్యుఁడై యుండెను. పరమానందచ్ఛటలచే నాతని ముఖమండలము దేదీప్యమాన మగుచుండెను. జడభరతుఁడు చిత్రప్రతిమవలెఁ దనమెడ వెనుకకు వ్రేలవేసికొని పడి యుండెను. ఆముఖమునందు నవనీత కోమల శిశుభావముల కాంతులు తాండవ మాడుచుండెను. అతఁడు విహ్వలుఁడై సంజ్ఞాశూన్యుఁడై పోయెను. పుణ్యతోయ మైన నిండునది యుభయపార్శ్వములఁ దటాకించి ప్రవహించునట్లుగా, నామహాత్ముని ముఖమండలమునందలి యానందజ్వాల లాతనిమనో దేహములరెంటిని దటాకించి పవిత్రము గావించుచుఁ బ్రకటిత ములగుచుండెను. మలినజీర్ణవస్త్రముచేఁ బరివృత మైయున్న యాదేహమునందు దివ్యకాంతు లుద్భాసితము లగుచుండెను. అతనిహృదయాకాశమున నుదయించిన పూర్ణసుధానిధిపండు వెన్నెల లాతనిపింగలజటాకలాపమునుండియు నాతనిధూళి ధూసరితదేహమునుండియు బ్రజ్వలితము లగుచుండెను. అతని దేహమునుండి యొకదివ్యసుగంధము నిర్గతమై యాప్రదేశము నంతను స్వర్గకుసుమ సురభిళసువాసితముగాఁ జేయుచుండెను.

రాజు, ఆ దృశ్యమును జూచుచు నిఁక నిల్వఁబడ లేక పోయెను—అతనివిశాలరాజప్రాసాదము, వాతనిపుత్రమిత్రి

కళత్రాదులు, నాతనిసంసారము నీదృశ్యమునెదుట నశించుచ్ఛ ముసై పోయెను. మానవజీవనముయొక్క పరమసౌభాగ్య మైన, యట్టిదృశ్యమును జూడఁగలవాఁ డెవ్వఁడు తక్కినదాని మేలెంచును ? "కోహినూరు" వజ్రమును జూచువాఁడు గాజు ముక్కను బ్రేమించునా ?

"నేను నాజీవితమునందు దేనికొఱకు వాంఛించు చుంటినో దానినే పొందఁగల్గితిని—నాకిఁక సంసారమువలదు" అని రాజు తలపోసికొనియెను. సైన్యగణమును, బల్లకిమోఁత గాండ్రను బల్లకిని బంపివేసి రహూగణమహారాజానడిరేయి యందాజడభరతునియడుగులకడఁ బడిపోయెను. అట్లుండియే రాజు, తనపాపపంకిలమైనవైషయికజీవనమును దలఁచుకొనుచు నీరవుఁడై కన్నీళ్లు విడుచుచుండెను. జడభరతుఁడును యథా రీతిగా సంజ్ఞాహీనుఁడై భావావేశమునందావిష్టుఁడై పడి యుండెను.

ఎన్నిగడియ లిట్లు గడచిపోయెనో వారిరువురుఁగూడ నెఱుఁగరు. తూరుపుఁగొండపై నుదయభానుఁడను నుజ్జ్వలచిత్ర కారుఁడు పొన్నచెట్లచిగురుకొమ్మలయాకుల నించుక రాగ రంజితములనుజేయుచుండఁగా, భరతునిభావసమాధికి భంగము గల్గెను. అతఁ డప్పుడు కన్నులు విప్పి చూచెను. దీనవేష ముతో రాజాతనిపదప్రాంతమునఁ బడి దుఃఖించుచుండెను. జడభరతుఁ డాదరముతో నాతనిచేయి పట్టుకొని లేవనెత్తెను.

రాజప్పు డశ్రుపూరితనేత్రములతో జడభరతుని జూచుచు — "స్వామీ! సర్వకష్టుఁడైనవాఁడు మహాశాపధనేవచేఁ పున రుజ్జీవితుఁడైనట్లు, దుర్నిరిబద్ధుఁడై, యహంకారపుష్టమైన నాయీయాత్మ మీయుత్తమసంసర్గమునఁ బునర్జీవనలాభమును బొందినది. నేనింక మిమ్ములనువిడువఁజాలను. నేను పంజరాబద్ధమైనపక్షిని—స్వచ్ఛగాములైనవిహంగములఁ జూచి యెగురుట కువ్విళులూరుచుంటిని. నాపక్షపుటములు బంధింపఁబడినవి. నాకు దారి చూపి రక్షింపుము!" అని ప్రార్థించెను.

భరతుఁడు "మహారాజా! నీవు దీనవేషముతో నేకాకివై సమస్తతీర్థములను సేవింపుము. సర్వదా సచ్చింతనమును వృద్ధినొందించుకొనుము. సాధుసంగతిని మెలంగుము. ఎట్టి విషయములయందు నాసక్తుఁడవు గాఁబోకుము. ఆవశ్యకమైనప్పుడు నిన్ను మరలఁ గలిసికొనఁగలను" అని చెప్పెను.



# జడభరతుఁడు.

## పదునాల్గవ ప్రకరణము.

జడభరతుఁడు మరల మౌనమును ధరించి యెప్పటియట్ల గృహమున కరుదెంచెను. అనసూయ వానిని జూచి "ఓ మూఁగవాఁడా! రాత్రియందు నీయిష్టమువచ్చిన ట్లెక్కడఁ దిరిగెదవు సరిగా భోజనపువేళకు మాత్రము సిద్ధముగ నుందువు. జ్ఞానమున్నను లేకున్నను ఈజ్ఞానము మాత్రము నీకున్నది! సరే చూతుము, నీకొకపని చెప్పెదను — నేనిప్పు డొక్కమాఱు మా బావగారియింటికిఁ బోవలయును. జాముసేపులోఁ దిరిగి వచ్చెదను. మొన్నను వారు మనకుఁ బంపినవాలుగైదు కావళ్ల ధాన్యము దారిలో వర్షముచేఁ దడిసిపోయినవి. అవి వాకిట నెండఁబోసితిని. నీవు ధాన్యమునకు గనిపెట్టుకొని యుండుము. అక్కడనుండి కదలకుము. నేను తిరిగివచ్చి భోజనముపెట్టెదను" అనిచెప్పి తలకొంగు నెత్తికొని యామె చరచర వెడలిపోయెను. జడభరతుఁడు ధాన్యమునద్దఁ గూరుచుండెను. ధాన్యముమీఁదను ననేకములగు పక్షులు ఎగిరి వచ్చి పడుచుండెను. జడభరతుఁడు జూచి యవి యొక్కొక్కసారి వెనుకంజవేయుచు మరల నెమ్మదినెమ్మదిగా ముందుముందునకు గంతులిడుచు

పక్షులు గుములు గూడి వచ్చుచు నాధాన్యము నాక్రమించు
కొనియెను.

కొంతసేపైనతరువాత బంధువులయింటఁ దానును కుమారుఁడును విందు లారగించి యాపిమ్మట మఱికొంతసేపటి కనసూయ బంధువులవద్ద సెలవు గైకొని లేచి శితికంఠునిచేయి చేతఁ బట్టుకొని మందగమనము సేయుచు నింటికి బయలుదేరెను. కొంచెముసేపటి కామె యిలు సేరెను. అప్పు డామె "అయ్యో! పాపము భరతుఁ డింకను భోజనము చేయకుండఁగనే ధాన్యము గాచుకొని యున్నాఁడు. నేనును బిడ్డఁడు గడుపు నిండఁ దిని వచ్చితి" మని యించుక లజ్జచెందెను. వెంటనే గబగబలాడుచు నామె యింటఁ బ్రవేశించి చూచునప్పటి కామె శరీర మాపాదమస్తకము మండిపోఁజొచ్చెను. ఆమెయిల్లంతయుఁ బక్షులమయమైపోయెను. ఇంచుమించుగా ధాన్యము నిశ్శేషమై పోయెను. జడభరతుఁ డావసారాలో నొకమూల నొదిఁగి కూరుచుండి యుండెను. ఆతనిపాదములదగ్గఱఁ జెదరి పడియున్న ధాన్యపుగింజల నేరికొని తినుటకుఁ గొన్ని పక్షులాత పాదము లెక్కుచుండెను. భరతుఁడు ఱెప్పపాటు లేక యట్లే యుండెను.

ఈదృశ్యమును జూచి యనసూయ యిఁక సహించుకొనలేకపోయెను. అప్పు డామె యొకకణుపులమోటుకఱ్ఱను దీసికొని భరతునివీపుపై నిష్ఠురప్రహారములఁ బ్రసాదింపఁ

జొచ్చెను. వీపు బద్దలై రక్తము ప్రవహింపఁజొచ్చెను. విరామము లేకుండఁ దగులుచున్న యామూర్ఖురాఘాతములచే నాతఁడు స్మృతి తప్పి నేలపైఁబడిపోయెను. కాని యాతఁ డెప్పటిమౌనమును విడువలేదు.

ఈవిధముగాఁ గొట్టికొట్టి యాతనివదినెగారు పశువుల భుక్తావశేష మొకగంపెడుధాన్య ముండఁగా వానినెత్తికొని యింటిలోఁ జాగ్రత్త చేసికొనియెను. శితికంఠుఁడు వాకిట నేడ్చుచుండెను. వానినూరకుండఁబెట్టుటయుఁ గూడ నామెకుఁ దోఁచుట లేదు.

ప్రొద్దుపోయినతరువాత నాయిల్లాలు "నేఁడు భరతుఁడు భోజనము చేయలేదని యాతనిమోము చూచినవెంటనే యాతనియన్నగారు తప్పక నిశ్చయించుకొనఁగలఁడు" అని భావించుకొనియెను. భరతునిశరీరమునందలి దెబ్బలు చూచి, పోయిన ధాన్యమునైన లెక్కసేయక తనపై నాతఁడు మహాగ్రహుఁడు కాఁగలఁ డని యామె యనుకొనియెను. గృహకృత్యభారమించుకంతయు భరతునికిఁ గలుగనీయవల దని యాతఁడు తఱచుగ నాతోఁ జెప్పుచునే యుండెను. నాచేఁ జావదెబ్బలు తినుటయే కాక భరతుఁడు నేఁడు భోజనమునుఁగూడ దూరమైనాఁడు. ఇదియంతయుఁ దలఁచుకొనిన నాకుఁ జాలభయమగుచున్నది. శీఘ్రముగా వానిని నొకయింటిలోఁ దాఁచి యుంచవలయును. అతని యన్నగారు వచ్చి యడిగినచోఁ దిని

నిద్రించుచున్నాఁడని చెప్పెదను. ఇంకను నాతఁడు భరతుని దేహమందలి దెబ్బలనుగూర్చి యడిగినచో "నేమో యెవ్వరిచే దెబ్బలు తినెనో నే నేమి యెఱుఁగుదు" నని చెప్పెదను. కాని యిప్పు డీపశువునకు భోజనము పెట్టవలయు నని నాకు బుద్ధి పుట్టుచున్న దేమి! అయినను పశువునకుఁ బశుయోగ్య మగు భోజనమునే పెట్టవలయును. ఇట్లు భావించుకొని యనసూయ వెంటనే వంటయింటఁ బ్రవేశించెను. వంటయింటి నుండు దొక మూల ముక్కిపోయిన ఉప్పుడుబియ్యపునూకలబుట్ట యామెకుఁ గనఁబడియెను. తత్క్షణ మామె యాబుట్టనుండి యించుక నూకలను దీసికొని వానిలో నించుక ఊఁకయు నించుక తెలక పిండియుఁ గలిపి వంటకము గావించెను. ఆపదార్థము వండు నప్పు డెట్టిదుర్గంధము బయలుదేఱెనో కాని యామె నాసికా రంధ్రమును గుడ్డతో బిగించుకొనక వంటయింట నిల్వఁజాలక పోయెను. "ఈమూఁడుపదార్థములతోడను సిద్ధముచేయఁబడిన వంటక మేజీవజంతువునకు నాహారము గాఁజాలదు. మూఁగ వాఁ డేది పెట్టిన నదియే కిక్కురనక భుజించుచుండును. నేఁటి భోజనమువలన వానికిఁ దగినశిక్ష కాఁగలదు. ఇది యిప్పుడే యాతనికిఁ బెట్టెదను. తనకుఁ బ్రాణరక్షణకరమైన ధాన్యమును గూర్చి యాతఁడు నేఁడు చూపిన యవజ్ఞకుఁ దగినఫల మీ భోజనమువలన నాతఁ డనుభవింపఁగలఁడు." అని యనసూయ భావించుకొనియెను.

పిమ్మట నాతఁడాహారము నొకగదిలో నొకవిస్తరియందు వడ్డించి యాతని నాగదిలోనికిఁ దెచ్చి యాసుగంధపూరితమైన యభోజ్యపదార్థమువద్ద నాతనిఁ గూర్చుండఁజేసి వెడలిపోయెను. జడభరతుఁడు దానిని చక్కఁగా భుజించివేసెను. వీఁపుమీఁది దెబ్బలనుండి యవిరతముగా రక్తము గాఱుచుండెను. దినమంతయు భోజనము లేకుండుటచేఁ గడుపు వెన్నున నంటుకొనిపోయియుండెను. దేహమంతయు ధూళిధూసరితమై దెబ్బలచే గతుకులుపడి యుండెను. అప్పటికి భోజనపువేళ మిక్కిలి యతిక్రమించిపోయెను. అట్టియవస్థయం దాపరమభాగవతుఁడైన—జడస్వరూపుఁడైన భరతుఁ డాకుటీరమధ్యమునందలి యఖాద్యమును ముందుగా నారాయణునకు నివేదనొనరించి పిమ్మట నాతఁడు భుజింపనప్పటి కది యమృతమైపోయెను.

అనసూయ సాయంకాలము భరతుని యెంగిలివిస్తరిని దీసిపాఱవేయుట కాగదిలోనికిఁ బోయెను. పోవునప్పు డామె మరల ముక్కునకు వస్త్రధారణ మొనరించుకొనియేపోయెను. కాని యామె మొదట విస్తరిలో భోజన మని వడ్డించిన యభోజ్యమును నిశ్శేషము గావించి భరతుఁ డక్కడితాటియాకులచదరపైఁ బండుకొనెను. అనసూయ యాతనిఁ జూచి యాశ్చర్యముతో “అయ్యో! నిజముగా నీవు కేవలము పశువు! ఆవు గాని, మేఁక గాని యిట్టివస్తువును దిన కొల్లదు.

దీని నీతఁడు స్వచ్ఛందచిత్తముతో భుజించివేసినాఁడు. తిను నప్పుడు ముక్కునకు గుడ్డమైన నీతఁడు గట్టికొనలేదు. ఈతని కిది దివ్యపుష్పగంధము లభించినట్లున్నది!

"ఏమైననగుఁగాక! ఇట్టి యఖాద్యముఁ దినువానికొఱ కన్నమును గూరలు నేల వ్యయపఱుపవలయును" అని యనుకొని యామె యెంతయు నూఱటఁ జెందెను.

అప్పటినుండి యనసూయ యానిర్దుష్టాహారమును సిద్ధపఱిచి భరతునకుఁ బెట్టుచునేయుండెను. రెండుమూఁడు దినము లిట్లు జరుగునప్పటికి యిరుగుపొరుగువార లిఁక నిల్వలేక యనసూయను బిలిచి "అమ్మా! ఏమిది, మీవంట యింటినుండి భరింపశక్యముగాని దుర్వాసన బయలువెడలుచున్నది?" అని యడుగఁజొచ్చిరి. అనసూయ వారితో "ఏమో, ఎక్కడినుండి యేమి పాడైనదో కాని వాసనవచ్చుచున్నమాట నిజమే, యీవేళనిల్లంతయు వెదకిచూడవలెను." అని సమాధానము చెప్పుచుండెను.

తనకుఁ దనభర్తకుఁ బుత్త్రికకు నన్నముఁ గూరలు సిద్ధముచేసి మూఁతలిడుకొని, పిమ్మటఁ బశువులపాకలో నొక మూల, నొకపాత్రకుంపటిపై ననసూయ భరతునకు వంటకము ప్రత్యేకముగాఁ జేయుచుండెను — చెడిపోయిన [illegible] పిండి, ముక్కిపోయిన యుప్పుక, పాడైపోయిన [illegible] బియ్యముఁ బ్రోగుచేసినముఁ [illegible] కొండెముగా [illegible]

భరతునకు శ్రద్ధగా నామె పెట్టుచుండెను. క్రమముగా ననసూయ నాసిక కాసద్గంధ మలవాటుపడియున్నది గాఁబోలు, నిప్పు డామె భరతునివంటకమునందంతగా మున్నువలె ముక్కు బిగించుకొనుట లేదు. ఇఁక నామెకు నాసికాబంధన ముక్కఱలేకుండఁగనే తనవంటవలెనే భరతుని వంటయుఁ జేయుట యభ్యాసమైనది.

ఎప్పటివలె నొకదినమునం దనసూయ భరతుని యెంగిలి విస్తరి తీయుటకు వచ్చెను. ఆమె ముక్కునకు మునుపటివలె నిప్పుడు బంధనము లేదు. భరతుని విస్తరిలో నించుక భుక్త శేషము నేఁడు మిగిలియుండెను. అది చూచి యామె "ఏమిది, నేఁడు భరతుఁడు భోజనములోఁ గొంత దిగవిడిచి నాఁడు!" అని గొణుఁగుకొనుచు విస్తరివద్ద వంగి దానిని ప్రోవు చేయఁబోవుచుండఁగా నాయభోజ్యమునుండి దివ్యపద్మగంధ మొకటి యనసూయనాసికకు లభించెను. అది చూచి యామె "ఈదివ్యసుగంధ మెక్కడిది చెప్పుమా!" యని నలువంకలఁ జూచి తనచేత నున్న యాకునెత్తి ముక్కుదగ్గఱఁ జేర్చికొని యెను. ఆ యెంగిలాకునుండియే యా దివ్యగంధము వ్యాపించు చుండుట యామె తెలిసికొని విస్మితురాలు గాఁజొచ్చెను—"ఆహా! యేమీ? మూఁగవాఁ డిట్టి దివ్యసుగంధపదార్థమునే ప్రతిదినము భుజించుచున్నాఁడా, దీనినుండి యీమనోహర పరిమళ మెట్లు కలిగినది? ఇది యంతయు వాహస్తములస్వభా

విశేషగంధమేనా ? ఏమైనఁ గానిమ్ము. ఇది యేమో చూ-
దను. ఇక్కడ నెవ్వరును లేరుగదా!” అని యనుకొని
యనసూయ భయపడి నల్దిక్కులతో నలువంకలఁ జూచుచు
జూచుచు భర్తని భుక్తశేషము నించుక నోట వేసికొ-
నెను—అనసూయ కష్టాన్నము సేవించిన ట్లయ్యెను. వెంటనే
యామె మిగిలిన దంతయు నొక్కకణము విడువకుండ భుజించి
వేసి విస్మితురాలై పోవుచుండెను. ఇట్టి యపూర్వాన్నము
నామె వండింపఁ గాని యత్తింటఁ గాని మరి యెప్పుడైనఁ
గాని యెన్నఁడు భుజించి యెఱుఁగదు. ఒకానొకప్పుడు జాలం
ధరమహారాజు వీరిప్రాంతములకు వచ్చి దేవతామహోత్సవ
ములను గావించియుండెను. అప్పు డామహారాజు దేవుని
భోగముకొఱకు, నుత్కృష్టవంటకముల ననేకముల వండించి
బ్రాహ్మణులకును ముత్తైదువులకును సంతర్పణములు గావిం
పించెను. అప్పు డనసూయ యనేకదివ్యాన్నములను—పిండి
వంటలను భుజించెను. కాని యప్పుడుగూడ నిట్టియుత్కృష్ట
పదార్థము నామె చూడలేదు.

ఒకనాఁ డనసూయకు, నామె భర్త వస్తుగుణములను
గూర్చి బోధించుచు “పసపును సున్నమును దెచ్చి యీరెండు
వస్తువులు నేకముచేసినచో నది యెఱ్ఱనిపారాణి యగుచున్నది.
పసపునందుఁగాని సున్నమునందుఁగాని ప్రత్యేకముగా నెఱ్ఱఁ
దనము లేకున్నను, ఆరెండువస్తువులు గలిసినప్పు డది యొక

నూతనవర్ణము గల్గి క్రొత్తవస్తువుగా మాఱుచున్నది" అని యేమేమో చెప్పుచుండఁగా ననసూయ "మీ రిన్ని శాస్త్రములలోఁ బండితులుగదా, దాని కాగుణ మెట్లువచ్చినదో చెప్పుఁడు సుంతము" అని తనభర్తను బ్రశ్నించెను. అప్పు డాతఁడు "అదియే వస్తుగుణము" అని సమాధానముఁ జెప్పెను. ఇప్పు డనసూయ కాకస్మికముగా నావస్తుగుణబోధనము జ్ఞప్తికి వచ్చెను. అప్పు డామె, యది వస్తుగుణ మనియుఁ దనపనితనముయొక్కయు, హస్తవిశేషముయొక్కయు, నద్భుత నైపుణ్యమనియు, నామూఁడువస్తువులు నఖాద్యములు గల్గుటచే నట్లు నఖాద్య మయ్యె ననియుఁ గ్రహించెను.



# జడభరతుండు.

## పదునేనవ ప్రకరణము.

ఈసత్యమును బ్రకటించుటకై యుత్సాహముచే ననసూయ యొక్కమాటలుగా నానందపరవశురాలై పోయెను. ఎప్పుడు పెనిమిటి యింటికి వచ్చునా, ఎప్పు డాతనికిఁ దాను గనిపెట్టిన యద్భుతవిశేషమును బ్రకటింతునా యని యామె మహాందోళన మొందుచుండెను. అప్పు డామె చరచర మని యింటనుండి వాకిటికి, వాకిటనుండి యింటికి చరణము లఱిగి పోవునట్లు తిరుగుచుఁ బ్రాణేశ్వరుని రాక కెదురుచూచుచుండెను. ఎక్కడ నేయించుక చప్పుడైనను వీథిగుమ్మము వంకకుఁ దిరిగి పరువిడుచు "వచ్చుచున్నాను, వచ్చుచున్నానుండుఁడు" అని కేకలువేయుచుఁ దలుపు దెఱచి భర్త రాకుండుటచే నిరుత్సాహపడుచుండెను. ఇట్లు రాత్రి కొంత ప్రొద్దు పోవునప్పటికి ముక్తికాముఁడు వీథిగుమ్మముదగ్గఱ నవతరించెను. అప్పటి యాతనిపిలు పాతని యనసూయచెవులకు గంధర్వసంగీతమునకన్నను సుఖమొసఁగెను. అనసూయ యొక పరుగునఁ బోయి తలుపు దెఱచి పెనిమిటికిఁ బాదుకోన్నలు, బాదోదకమును జేతులార నెనుపఁగాఁ జెప్పెను. ముక్తి

కాముఁడు పాదప్రక్షాళనమునకుఁ జేయుచున్న యాలస్యము నకు సహింపఁజాలక యనసూయ కంకణాలంకృతమైన తనకర ముతోనే పతిపాదములు గబగబ గడిగివేసెను. "నేఁడీ యతి భక్తి యెందులకు?" అనిముక్తికాముఁ డనసూయను బ్రశ్నిం చెను. అనసూయ మందహాసవదనారవిందము హర్షగర్వ ప్రఫుల్లమైపోయెను. ఆమె మాఱుమాట చెప్పకయే యక్కడ నుండి గబగబ నడచి వంటయిల్లు తుడుచుచుండెను. అంతలో ముక్తికాముఁడు మడిగట్టి సంధ్యావందనమునకుఁ గూరుచుం డెను. అనసూయ నిమీలితనేత్రుఁడై కూరుచున్న పతివద్దకు వికసితముఖియై వచ్చి కూర్చుండి "ఈవేళ సంధ్యాజపములు చరచర గానిండు. ఆలస్యముచేయుటకు వలనుపడదు. మాట్లా డవలసినపని యున్నది" అని నవ్వుచుఁ బలికెను.

అనసూయ యుద్వేగాతిశయమును జూచి ముక్తికా ముఁడు, "నిశ్చయముగా నాభార్యకు నేఁ డేదియో ధనరాశి లభించి యుండెను." అని భావించుకొనియెను. ఇఁక నాతని [illegible]ని జపమాల, వాయువేగమనోవేగములతో దిరుగఁ [illegible] నిత్యనైమిత్తికము లన్నియు నేఁ డాతఁడు విద్యు [illegible]తోఁ గావించి ముగించుకొని భోజనపుఁబీటమీఁదికి [illegible]చుండెను. వెంటనే యాతఁడు దేవతాపంచకము [illegible] గావించి "ఏమీ! చెప్పుము విశేషము లేమి?" అని హాస్యసంకోఁ బలికెను.

అనసూయ "విశేషము లున్నవి లెండు. మీరు భోజనమునకుఁ బ్రారంభింపుఁడు" అని పలికెను. ముక్తికాముఁడు హృదయేశ్వరి యాదేశమును శిరసా వహించి భోజనమున కుపక్రమించెను. అనసూయ యొకచేత విసనకఱ్ఱను బట్టుకొని విసరుచు విసరుచు "రేపటిదినమున మన మొక పనిచేయవలయును. రేపు మీరు యజనార్థ మూరిలోనికి వెళ్లుటకు వలనుపడదు" అని భర్తను జూచి పలికెను.

ముక్తికాముఁ డప్పుడు చేతిలోని ముద్దను నోటిలోఁ బెట్టుకొనఁబోవుచు నట్టే యాఁగి "ఆఁ! ఏమది?" అని ప్రశ్నించెను.

అనసూయ—రేపటియుదయముననే మీరు మన [illegible]రాదివా రందఱను మన యింటికి భోజనములకుఁ బిలుచుకొని [illegible] నేను వంటకము లన్నియు సిద్ధము చేసెదను.

[illegible]—అంత శ్రమము మన కెక్కడిది? ఇప్పు డంత [illegible] పెట్టవలసిన మహోత్సవము మన యింట నేమి వచ్చినది?

అనసూయ—మీ కంతగా వ్యయమేమియుఁ గానక్కఱలేదు లెండు. పనికిరాని యుప్పుడుబియ్యపుచీరునూకలు చిరకాలమునుండి యొకమూలఁ బోసి యుంచితిని. పసువులు తినక పాడుపడిపోయిన తెలికపిండియును, ఊకయు మన యింట నున్నవి. ఇవి యన్నియు నేను జాగ్రత్త చేసి యుంచినాను.

ఈమాటలు విని ముక్తికాముఁడు నీరవుఁడై పోయెను. అతఁడు "అయ్యో దైవమా! నాభార్యకు మెదడు చెడి వికార మెత్తిపోయినది. ఇఁక నా సంసారముగతి యేమి? నా గతి యేమి? నా శిశువంశు నెవ్వరు రక్షించెదరు?" అని దిగులొందఁజొచ్చెను.

అనసూయ—ఏమిది, కన్నీళ్ళు విడుచుచు, నట్లు నివ్వెఱపడిపోవుచున్నారేమి? నామాటలు మీరు నమ్ముట లేదా యేమి? నాకుఁ బిచ్చియెత్తలేదు. మీ రేమియు నట్టి భయము పొందనక్కఱలేదు. ఈశ్వరసాక్షిగాఁ జెప్పుచున్నాను వినుఁడు. దైవబలముచే నే నొకవిచిత్రమైన వంటకమును నేర్చికొన్నాను. ఇప్పుడు నేను మీతోఁ జెప్పిన వస్తువులను గలిపి యమృతమువంటి యొకదివ్యాన్నమును జేసిపెట్టఁగలను. ఈభూమియం దట్టి సుభోజ్యము నెవ్వరు నెప్పుడు దిని యెఱుఁగరు. అట్టిదాని నెవ్వరు స్వప్నమునందైనను నెఱిఁగి యుండఁజాలరు. రేపు మీకు నామాటలయథార్థము తెలియఁగలదు.

ముక్తికాముఁ డనసూయమాటలయం దించుకేనియు విశ్వాసము గలుగలేదు. కాని యామె యత్యంతనిశ్చలభావమును జూచినప్పుడుమాత్ర మాతఁడు, "ఐనఁ గావచ్చును. ఏమో, 'నచ దైవాత్పరమ్ బలమ్' అనియున్నదికదా!" అని యుననుకొనుచుండెను. దినమంతయుఁ బరిశ్రమచెంది వచ్చుటచే నాతఁడింక నేమి యోచించుటకును శక్తిలేనివాఁడై కూరుకుపాట్టు

పడుచుఁ గూరుచుండెను. అయినను, అనసూయయత్యావేగము తో సత్యోత్సాహముతో నదేపనిగా నదేప్రసంగము చేయుచుం డుటచే నాతనికి నిద్దుర వెనుకపట్టి యామె యెంతతీవ్రముగా మాటలాడిన నంతతీవ్రముగా నామెమాటలను ఖండించుటకుఁ బ్రారంభించెను. క్రమముగా దీర్ఘనిశ్వాసములును, బెద్దపెట్టున శోకములును బయలుదేఱెను. నిద్రాదేవి యొక్కమాఱుగా వారియింటినుండి యారాత్రికి సెలవు పుచ్చుకొని వెడలి పోయెను—కొంతసేపటికి ముక్తికాముఁడిక వేఱుకుమార్గ ణము వేఁడక, అనసూయ చెప్పినదాని కెల్ల నౌనని యొప్పు కొనుచు స్తిమితతఁ దెచ్చికొని మంచముపైఁబండుకొనియెను. అప్పు డొకమాఱు నిద్రాదేవి యాతనిని తిరిగి తొంగిచూడఁ జొచ్చెను. పిమ్మట నాతఁడు కరచరణములు చాచుకొని గాఢ నిద్రాభిభూతుఁ డయ్యెను. అనసూయమాత్రము తాను మఱు నాఁ డుదయమున నమృతాన్నము సిద్ధముచేయవలసిన యా లోచనతో రాత్రి యంతయు జాగార మొనరించెను.

మఱునాఁటియుదయమున భార్య యదలింపుఁబడుచు నామె చెప్పినట్లెల్ల ముక్తికాముఁడు గ్రామమునందలి సకల బ్రాహ్మణగృహములకు నేఁగి వారినందఱఁ దమయింటికి భోజనమునకుఁ బిలిచికొనివచ్చెను—నాభార్య యొకదివ్యమైన యమృతాన్నమును వంటచేయుట నేర్చుకొనినది. ఆదివ్యాన్న మును మీరు పరీక్షపూర్వకముగా నారగించుటకు నేను మా

యింటికి రావలయును" అని యాతఁ డూరివా రందఱకుఁ జెప్పివచ్చెను. ఆతఁ డట్లుపిలిచి వెళ్లినతరువాత శ్రీకంఠుఁడు తనభార్యను జూచి "వింటివా? మాపెద్దన్నగారిభార్య అమృతాన్నమును వండుట నేర్చికొనిన దట! నీవంటిదానిని బెట్టుకొని సంసారముచేయుట కేవలము వ్యర్థమేకదా! నేనిప్పు డంగడికిఁ బోయి కావలసిన మంచివస్తువుల నన్నిటిని దెచ్చెదను. కాని యానంటక మెట్లు చేయవలయునో మాపెద్ద వదినెగారివలనఁ దెలిసికొనుట కష్టము. పశువులుకూడఁ దినని యూఁక మొదలగువస్తువు లేమేమో తెచ్చి యామె కేవలము దైవకృపచే నట్టినంటకమును సిద్ధముచేయుచున్న దఁట. ఏమైన నేమి? పెద్దన్న పెండ్లాము అమృతాన్నము నంటకము నేర్చికొనినది. దానికి వ్యయము గూడ విస్తారము గాదఁట! అంతయు వారియదృష్టము" అని పలుకఁజొచ్చెను. శ్రీకంఠుని భార్య అమృతాన్నము వండఁగలది గాదు—ఆమె భర్త మాటలు వినుచుండఁగనే మోము ముడుచుకొని మూతి విఱుచుకొనుచు నటనుండి వెడలిపోయెను.

నేఁడు ముక్తికాముని గృహమునం దమృతాన్నభోజనములు! ఆ చిన్నపల్లెయం దంతట నీకథ ప్రకటితమైపోయెను. ఊరిలోని బాలకు లందఱు నడుములకు మడిబట్టల బిగించుకొని యమృతాన్నభక్షణమునకు హర్షాభిలాషములతో గంతులు వైచుచుండిరి. కేవలము భోజనప్రియులుమేకాక, యది

దేవదుర్లభమైన యమృతాన్నభోజనముగూడ నగుటచే నేఁడాబ్రాహ్మణపల్లె యంతయు నెట్టిసందడి గల్గియున్న దని చెప్పుదును! సముద్రమువలె నల్లకల్లోలమగుచుండెను. ఆదేవదుర్లభమైన యమృతాస్వాదనమునందలి యాసచే, నేఁ డాపల్లె యందలి యజమానులు, భార్యలు, పుత్రికలు, పౌత్రులు. మాతృదేవతలు, సోదరీమణులు, అన్నిస్థానములవారు సంకష్టము లేకుండ బయలుదేఱిరి. ముక్తికాముని గృహిణియగు యశసూయాదేవికీర్తిభేరి మ్రోగిపోవుచుండెను.



# జడభరతుండు.

## పదునాఱవ ప్రకరణము.

రెండుజాములకుఁ బూర్వమే సమస్త బ్రాహ్మణగణము ముక్తికాముని గృహ[illegible]చేసిరి. కాని వారందఱు వచ్చి[illegible] ముక్కులు గట్టిగా మూసికొని "అబ్బా! ఇదియేమి యీ దుర్గంధము, ఎక్కడనుండి వచ్చుచున్నది?" అని [illegible] కేకలు వేయఁజొచ్చిరి. అందు గొందఱు దుర్గంధమును సహించుకొనలేక వమనములు చేసికొనఁజొచ్చిరి. ముక్తికాముఁడు పిచ్చియెత్తినవానివలె నొక్కొక్కమాఱు వంటయింటిలోనికిఁ బోవుచు, బుసకొట్టుచు ననసూయతో "నీవు సర్వనాశముచేసితివి. నేఁడు బ్రాహ్మణులందఱు నామోమున సున్నపుజుక్కలు పొడిచెదరు—నన్నూరినుండి తఱిమివేసెదరు. నే నింక లోకులముఖములు, చూడలేను. నీవు నన్ను నాతండ్రిగృహమునం దుండనీయకుండ నాపుట్టినయూర బ్రదుకనీయకుండఁ జేసివేసినావు. పిచ్చిదాని మాట విని నేను బిచ్చివాఁడనై పోయినాను—ఈదుర్గంధమునకుఁ బశువులుగూడఁ ద్రాళ్లు ద్రెంచుకొని పాఱిపోవుచున్నవి. నిర్భాగ్యురాలా! ఇదియేఁటి యమృతాన్నము? అయ్యో!

భగవంతుఁడా! న న్నొక్కమాఱుగాఁ జంపివేయుము. ఎట్లై ననుసరే, నేను నాసర్వస్వముఁ బోఁగొట్టుకొని యైనను నేఁటి మధ్యాహ్న మీబ్రాహ్మణగణమునకుఁ బంచభక్ష్యములతో భోజనసంతృప్తిఁ గావించి రాత్రి మృత్యుముఖమునఁ బడిపో యెదను—ఓ దయామయా! న న్నీవిపత్తునుండి యెట్లైనఁ దప్పింపవా?" అని యాబ్రాహ్మణుఁడు—ఆముక్తికాముఁడు చేతులు రెండు నూర్ధ్వముఖముగా నెత్తి భగవంతునిఁ బ్రార్థింపఁజొచ్చెను. ఆతనిగండభాగములనుండి యఖండితముగా నశ్రుధారలు ప్రవహించిపోవుచుండెను.

అనసూయ యాతని చేతులు పట్టుకొని "అయ్యో! మీరిట్లు పిచ్చివారైపోయినారేమి? ఈయన్నము విస్తరులలో వడ్డింపఁగానే యమృత మగును. మీరు నిశ్చింతగాఁ జూచు చుండుఁడు. వస్తుగుణ మిప్పుడే మీకుఁ దెలియఁగలదు!"అని పలికెను.

అన్నము వడ్డననిమిత్త మెంత చేరువయగుచుండెనో యంత దుర్గంధ మధికమై యక్కడివారికి దుస్సహ మగుచుండెను. బ్రాహ్మణులందఱు నంగవస్త్రములతో ముక్కులు బిగియఁగట్టుకొని యాదుర్గంధ మెక్కడనుండి వచ్చుచున్నదా యని పరీక్షించు టకు మొదలుపెట్టిరి. బ్రాహ్మణు లందఱు విస్తరులకడఁ గూర్చుండియుండఁగా, మేలిముసుఁగుతో ననసూయాదేవి య న్నపుఁబళ్లెరము చేతఁబట్టుకొని పాత్రములలో వడ్డనఁగా

వించుచుండెను. ఆఁకలిచేతను దాహముచేతను, అత్యాతురు లగుచున్న యాబ్రాహ్మణు లందఱు దుర్గంధముచే నస్థిమిత హృదయులై లేచుచుండిరి. కొందఱాఁకలి కోర్చుకొనఁ జాలక యొకటి రెండు కణములు నోట వేసికొని వెంటనే వమనములు చేసికొనుచుండిరి. ముక్తికాముఁ డప్పుడు మృత్యువువలె నలంఘ్యమైన క్రోధముచే నంధుఁడై యొక వెదురు కఱ్ఱను జేతఁ బుచ్చుకొని యనసూయకు విషమపరిహారము లొనరింపఁజొచ్చెను!

అనసూయ నేలపైఁ బడిపోయి సిగ్గుచే భూదేవిచాటున మోము దాఁచుకొని మఱి యెత్తలేకపోయెను. సహస్రవృశ్చికము లొక్కపెట్టున నప్పుడామెను గుట్టుటకు మొదలుపెట్టెను. అప్పుడు, అనసూయకు గర్వభంగ మైపోయెను—దర్పహారి యైన హరికృప లభించెను. అప్పు డామె యాకస్మికముగా నక్కడనుండి లేచి పిచ్చిదానివలెఁ గుటీరములోనికిఁ బోయి మూఁగవాని రెండుపాదములు పట్టుకొనియెను. "నాతండ్రీ! ఇది యంతయు నీకృపవలన నమృతము గాఁగలదని నే నిప్పుడు గ్రహించుకొంటిని. నేను మీయన్నభార్యను. మీయింటి కోడలను. లజ్జాంబునిలో మునిఁగియున్నన న్నుద్ధరింపుము. నీపైని నెన్నికఱ్ఱలు విఱిచితినో, ని న్నెన్నిబెదరింపులు బెదరించితినో, నీచే నెన్ని యభాద్యములఁ దినిపించితినో, అన్ని నీపుసట్ట దెబ్బలు న న్నిప్పుడు కొట్టుము. నేఁ డీఘోర

లజ్జాదావాగ్నిమధ్యమునుండి నీవదినెగారిని రక్షించుకొనుము. నేఁడు బ్రాహ్మణశాపమునుండి నీయన్నగారిని, నీవంశమును, వంశధరుఁడైన శిశికంఠుని రక్షించుకొనుము." అని ప్రార్థించుచు నేడువఁజొచ్చెను; నిశ్చేష్టయై జడభరతుని పాదములఁ బట్టుకొని కొంతసేపు పడియుండెను. కొంతసేపటికి కామె బాణవిద్ధమైన పక్షివలె టపటపఁ గొట్టుకొనఁజొచ్చెను.

అప్పుడు, ధూళిధూసరితాంగుఁడును, జటిలమస్తకుఁడును నైన యామహాపురుషుఁడు తనకుటీరమును వదలి నెమ్మదినెమ్మదిగా నక్కడకు వచ్చెను. ఎవ్వనినోట నుండి యొక్కమాటయైన నెవ్వరు నెప్పుడు వినియెఱుఁగరో, యాభరతుఁడు నేఁడు బ్రాహ్మణులయెదుట నిల్వఁబడి యిట్లు పలికెను.

"అయ్యలారా! మీ రందఱు భోజనములకుఁ గూరుచుండి యున్నారు. భుజింతురుగాక! గృహయజమానుని యపరాధము లేదు. మీరు దానిని పవిత్రపఱిచినచో నది యంతయు నమృతము గాఁగలదు. క్షమనుండియే యమృత ముత్పన్నమగుచున్నది." మూఁగవాఁడు మాటలాడుట-ఆసుధామధుర కంఠధ్వని—ఆసౌజన్యవిలాసము—బ్రాహ్మణు లందఱు విస్మితులై చూచుచుండిరి.

బ్రాహ్మణులు ప్రత్యుత్తర మీయ నవసరము లేకుండఁగనే జడభరతుఁ డాసాలపత్త్రములయందలి భోజ్యములను

ప్రత్యేక ప్రత్యేకముగాఁ దనచేతితో స్పృశించుచుఁ బోయెను. తత్క్షణమే యా సకలపత్రములయందలి యన్నమునుండియు దివ్యపద్మసుగంధము వాసింపఁజొచ్చెను. బ్రాహ్మణు లందఱు నమృతాస్వాదనమున ముగ్ధులైరి. వా రాభోజనముచే సంతుష్టులైపోయిరి. పిమ్మట వారందఱు, జడభరతుఁడు సాక్షాత్కరించిన భగవంతుఁ డని భావించి యాతనిఁ బూజింపఁజొచ్చిరి. జడభరతుఁడు వారందఱఁ జూచి “ మీరందఱు నీగృహస్థుని నిమంత్రణమును మన్నింతురుగాక. మీ రందఱు సంతుష్టిగా భోజనము లొనరించిన పిమ్మట మీతోడ మరల మాటలాడెదను.” అని చెప్పి తనకుటీరములోనికిఁ బోయెను.

బ్రాహ్మణు లందఱుఁ బరితుష్టిగా భోజనములు గావించి లేచి జడభరతునిచుట్టును నిల్వఁబడిరి. అప్పు డాతఁడు వారిని జూచి “ మీరందఱు నాచేష్టలకు విస్మయము నొందుచున్నారు. నేను నేఁడు మాటలాడుచున్నాను. చిరకాలము నుండి నన్ను మూఁగవానిగా మీరు భావించుచున్నారు. మీకు నాపూర్వవృత్తాంతము నిప్పుడు తెలియఁజేసెదను.

నేను బూర్వమునం దొకజన్మమున ఋషభదేవునకుఁ బుత్త్రుఁడనై పుట్టి భరతుఁ డను పేరితో నుంటిని. ఆజన్మము నందుఁ గొంతకాలము, దారపుత్రాదులతోఁ గడపి పిమ్మట గృహస్థాశ్రమమును వదలి పులహాశ్రమమునకుఁ బోయి తపస్సొనరించితిని. అక్కడ నేను దపస్సునందుఁ జాలవఱ కగ్రి

సంపూర్ణచంద్రబింబనిభమైన యాభరతుని ముఖమండలమును దిలకించుచుండెను. మఱియు విలపించుచుండెను. "ఈమోహముచేతనే నేనాపాతమునకు, ఊరక, తెలిసియు దిగజారితిని. అహో! నాతండ్రీ! భరతుడా! నా కింకను బుట్టగతు లున్నవా?" అని తలపోసికొనుచుండెను. ఆ యింటిలో నీశమోహ మెత్తుకొని యెట్లు తిరుగఁగలఁడీ నీలకంఠుఁ డను నింకొకసోదరుఁడు "మన తల్లిదండ్రులు భరతుఁ డిట్టివాఁ డని యెఱుఁగుదురు గనుకనే యాతనినాదరించిరి. మనము స్వర్ణమణిని బొందియు నెఱుఁగక తృణీకరించితిమి." అని చింతింపఁ జొచ్చెను.

జడభరతుఁడు తరువాత నెవ్వరియడ్డంకులను సరకు సేయక హరిద్వారమునకు వెడలిపోయెను. అచ్చట సింధుసౌవీరాధిపతి కాతఁడు మరల దర్శన మొసంగెను.

హిమాద్రి యనంతకాలమునుండియు స్థిరభావముతో నిలిచి యున్నది. అది మహాత్ముల యనిర్వాచ్య మగు యుత్కృష్టమహిమను బ్రకటించుచుఁ దద్భావావేశముచేఁ గదలక మెదలక యున్నది. ఆభావావేశముచేతనే హిమాచలము చిత్రప్రతిమవలెఁ బ్రశాంతమై యున్నది. దానివిశాలజటాజూటమధ్యమునుండి తుషారరాశి యెగసిపడుచు హరిద్వారమునకు విస్మయముగ జారి గంగాప్రవాహముగాఁ బరిణమించి యీయమృతపవిత్రముచే విశ్వమునంతను సుధామధుర

మయుంబుగఁ జేసివైచుచున్నది. రాత్రివేళ సమాధిప్రశాంత మగు హిమగిరిలలాటమున నర్ధచంద్రోదయమగుచున్నది పగలు సమాధిభంగసమయంబున గిరివరుని తృతీయనేత్రముం బోలి సూర్యుఁ డుదయించి యంధకారమును నశింపఁజేయు చుండును. అట్టిసమయముననే జ్ఞానోదయ మగుచుండును. ఓహిమాచలేంద్రా! భీషణంబు లగునజగరంబులు నీశరీర మున విహరించుచున్నవి. ఐనను నీ వొక్కభ్రూవిక్షేపమైనను గావించుట లేదు. ఆకాలకాకోదరవిషము నీయంగధూళిలోఁ గలసి నీలకాంతమణులను సృష్టించుచున్నది. ఆమణికాంతియే నీయుపకంఠనీలిమమై విరాజిల్లుచున్నది. నీవుసదాశివమూర్తివి!

ఓయద్రిరాజా! నీవు కేవలము శైలాధినాథుఁడవే కావు- పరమేశ్వరుఁడు తనకరకమలముచే స్వయముగ సంత రించిన శాంతసదాశివమూర్తివి! నీ సుస్థిర మూర్తియందే జడభరతునివంటి భారతీయసాధుసత్తముల దివ్యతేజోరూప లీలలు పరిదృశ్యమానము లగుచున్నవి—నిర్వికల్పు లగుభార తీయసాధుపురుషుల చిత్రచరిత్రములు నీసమున్నతశృంగముల వలెనే జగత్తునం దున్నతోన్నతములై యలరారుచున్నవి. ఓవిచిత్రచరిత్రా! ఓచిరశాంతిమయా! చిరసౌందర్యవిరా జితా! చిరకాలపూజ్యా! శివా! సదాశివా! నీకు నమ స్కారము!



## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 109 B 125 |
| పుస్తకం పేరు | జడ భరతుడు. |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 127 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | akshaya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |